

బిట్టూ బర్త్‌డే. ఎన్నెన్నో రస్నాలు.

# వేసవి సమయం రస్న సమయం.

వచ్చేసింది వేసవికాలం. అంటే ఇది రస్న సమయం అన్నమాట! హోమ్‌వర్క్ తరవాత రెండు రస్నాలు.




ఆటలకి ముందు ఇంకొకటి. ఇక బిట్టూ బర్త్‌డే పార్టీలో అయితే ఎన్నెన్నో! ప్రతీ ఆదివారం తాతయ్య, నాయనమ్మ వచ్చినప్పుడు ఇంకా ఎన్నో.

ఆరెంజ్ □ పైనాపిల్ □ లైమ్ □ షాహీ గులాబ్ □ కాలా ఖట్టా □ కూల్ ఖస్ □ కేసర్ ఇలైచి □ మసాలా సోడా (జల్ జీరా) □ టూటీ ఫ్రూటీ □ మేంగో రైప్ □ గ్రేప్ గ్లోరీ

## తాజాదనం చిందించే రస్న

**11 పసందైన రుచులు సరసమైన ధరలో**



ఐ లవ్ పాపా మరియు రస్న. ప్రతీ సాయంత్రం



తాతయ్య, నాయనమ్మలకు ప్రియమైన రస్న.

Mudra:ASAM/R/5159 Tel.

fun Bite

ఆనందంగా ఆడేటప్పుడు,
వినోదంగా పాడేటప్పుడు...

**ఫన్‌బైట్ మటుకే మీ సంతోషానికి సంపూర్ణత కలిగిస్తుంది**

Campco fun Bite Re.1

భారతదేశపు అతిపెద్ద అత్యాధునిక కర్మాగారం నుండి

క్యాంప్కో అందిస్తున్న ఫన్‌బైట్
సమృద్ధికరమైన క్రీమ్ చాక్లెట్.
కరకరలాడే వేఫర్ లోపల, రుచి
కరమైన చాక్లెట్ వెలుపల
వినోద సమయాలకి మరింత వినోదం
తెస్తుంది.

క్యాంప్కో లిమిటెడ్, మంగళూరు.

Other Campco chocolates: Milk / TURBO / Belairs / Playtime / RUBIES / TOFFEE
Campco beverages: WINNER / COCOA

R K SWAMY/CL/7804/TEL



చందమామ
మెయిల్-ఎ-టాయ్
పథకం

# చందమామ పాఠకులకు ప్రత్యేక కానుక!






A హోబీల్

సైజు : 13.5 అంగుళాలు (ఎత్తు) ధర : రూ. 83-00

అదనం : రూ. 4-80 తమిళనాడు లోపల జనరల్ సేల్స్‌టాక్స్
రూ. 8-30 తమిళనాడు వెలుపల సేల్స్‌టాక్స్

B టెడీ

సైజు : 10.5 అంగుళాలు (ఎత్తు) ధర : రూ. 93-00

అదనం : రూ. 5-35 తమిళనాడు లోపల జనరల్ సేల్స్‌టాక్స్
రూ. 9-30 తమిళనాడు వెలుపల సేల్స్‌టాక్స్

C జంబో

సైజు : 7 అంగుళాలు (ఎత్తు) ధర : రూ. 68-00

అదనం : రూ. 3-90 తమిళనాడు లోపల జనరల్ సేల్స్‌టాక్స్
రూ. 6-80 తమిళనాడు వెలుపల సేల్స్‌టాక్స్

D బౌవౌ

సైజు : 6 అంగుళాలు (ఎత్తు) ధర : రూ. 45-00

అదనం : రూ. 2-60 తమిళనాడు లోపల జనరల్ సేల్స్‌టాక్స్
రూ. 4-50 తమిళనాడు వెలుపల సేల్స్‌టాక్స్

E ఫాదర్ హేర్

సైజు : 6 అంగుళాలు (ఎత్తు) ధర : రూ. 25-00

అదనం : రూ. 1-45 తమిళనాడు లోపల జనరల్ సేల్స్‌టాక్స్
రూ. 2-50 తమిళనాడు వెలుపల సేల్స్‌టాక్స్

మా తరవాతి పెట్టులో, ఆనంద కుందేలుకుటుంబాన్ని పూర్తిచేయడానికి మామాహేర్, బేబీహేర్ రానున్నాయి !



మీరంటే మాకెంతో అభిమానం. అందుకే మీకోసం ఒక ప్రత్యేక కానుకను ఏర్పాటు చేశాం. మా బొమ్మలను మొట్టమొదట పొందే అవకాశం కూడా మీకే వుంటుంది. మీరు ఆశించే విధంగానే ధరలోనూ ప్రత్యేకరాయితీ వుంటుంది. మీరు పొదుపుచేయడానికి ఇంకొక మార్గం కూడా వున్నది. ఈ బొమ్మలు ఆర్డర్ చేయడం ద్వారా చందమామ చందాలలో రాయితీ పొందవచ్చు. 12 సంచికలకు 6 రూపాయలు తగ్గింపు! 24 సంచికలకు 15 రూపాయలు తగ్గింపు!






ప్రియమైన చందమామకు,

మీ 'మెయిల్-ఎ-టాయ్' పథకం గురించి చదివాను. బొమ్మల జాబితాను పరిశీలించాను.
దయచేసి వీటిని పంపండి (అవసరమైన వాటిపక్కన ✓ చేయండి).

* రేబిట్ * టెడి * జంబో * బౌ వౌ * ఫాదర్ హేర్

చందమామ చందాదారుగా చేరాలంటే దీనిద్వారా ప్రత్యేక తగ్గింపును కూడా పొందవచ్చని తెలిసింది.
నేను చందమామకు చందా పంపుతున్నాను :

* ఒక సంవత్సరం (36 రూపాయలకు బదులు 30 రూపాయలు)
* రెండు సంవత్సరాలు (72 రూపాయలకు బదులు 57 రూపాయలు)
* క్షమించండి. చందా తగ్గింపుపట్ల ఆసక్తి లేదు.

దీనితోపాటు, చందమామ టాయ్‌ట్రానిక్స్ (ప్రై) లిమిటెడ్ పేరు మీదుగా తీసిన రూ.........పోస్టల్ఆర్డర్/మనిఆర్డర్ పంపుతున్నాను.




Note : This offer is valid only up to 30-6-1990.

ఒక నెలలోగా బొమ్మ(లు) అందగలద(వ)ని ఆశిస్తున్నాను. ఒకవేళ బొమ్మలు నచ్చకపోతే వాటిని ఒక వారంలోగా తిప్పి పంపితే, ధర పైకాన్ని తిరిగి పొందవచ్చని గ్రహించాను.

నా పేరు : ____________ పుట్టిన తేది : ____________

చిరునామా : ____________

____________

నా అభిమాన విషయం : ____________

పత్రికలు/కామిక్స్ : ____________

టి. వి. కార్యక్రమాలు : ____________ బొమ్మలు ____________

వినోదాలు ____________ : చదవడం/బొమ్మలు/ఆటలు/టీవీ/వీడియో/వీడియో గేమ్స్/ఇంకేమయినా వుంటే రాయండి.






మీరు చేయవలసిందల్లా, ఇక్కడి కూపన్‌ను పూర్తిచేసి, మాకు— చందమామ టాయ్ ట్రానిక్స్ (ప్రై) లిమిటెడ్, చందమామ బిల్డింగ్స్, **188, ఎన్. ఎస్. కె. సాలై, వడపళని, మద్రాసు—600 026** చిరునామాకు పంపడం మాత్రమే. ఈ కూపన్ మాకు చేరిన ఒకనెల లోగా మీకు మా బొమ్మలు అందుతాయి. ఒకవేళ మీకు ఆ బొమ్మలు సంపూర్ణతృప్తిని కలిగించలేదంటే, ఒక వారం లోగా వాటిని మాకు పంపినట్టయితే, ధర మొత్తాన్ని మీకు తిప్పి పంపగలమని హామీ ఇస్తున్నాము.

గమనిక : కూపన్‌లో ఉన్న బొమ్మల జాబితాను పరిశీలించి, వాటిలో మీకు కావలసిన బొమ్మ/బొమ్మలు ఏవో వాటిపక్కన టిక్ (√) మార్క్ చేసి సూచించండి. తరవాత, మీ పూర్తి చిరునామాను స్పష్టంగా రాసి, బొమ్మ(ల) ధరను పోస్టల్ ఆర్డర్ ద్వారా పంపుతున్నారో, మని ఆర్డర్ ద్వారా పంపుతున్నారో తెలియజేయండి. దయచేసి బొమ్మల సరైన ధరను పంపండి. మీ ఆర్డరను పరిశీలించి, పంపడంలో చిక్కులు రాకుండా వుండడానికే ఈ సూచన. ఈ ముఖ్య అంశాలను స్పష్టం చేయకుండా కూపన్లను పంపినవారు, మళ్ళీ విడిగా ఈ వివరాలను మాకు తెలియజేయాలి. అప్పుడే వారికి త్వరగా బొమ్మ(లు) పంపడం సాధ్యమవుతుంది.




CUDDES

Manufactured in technical collaboration with
Sammo Corporation, South Korea.

**చందమామ టాయ్‌ట్రానిక్స్ (ప్రై) లిమిటెడ్**

'చందమామ బిల్డింగ్స్'

**188, ఎన్. ఎస్. కె. సాలై, వడపళని, మద్రాసు – 600 026**

Mudra:M:CT:3789

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'   సంచాలకుడు : నాగిరెడ్డి

## వాతావరణ కాలుష్యం!

అంతర్జాతీయ వినియోగదారుల సంస్థ సంచాలకుడు అన్వర్ ఫాజిల్, జపానులో ఇటీవల 'మన అందరి భవిష్యత్తు' అన్న అంశంపై ప్రసంగిస్తూ ఇలా హెచ్చరించాడు: ''రోజు రోజుకూ, నీరూ గాలీ కలుషితమైపోవడం వల్లా, ఉష్ణమండల అడవులు అంతరించిపోవడం వల్లా భూమిని చుట్టివున్న ప్రాణవాయువు పొర తగ్గిపోయి, ఇవాళ వాతావరణం అతి భయంకరంగా తయారయింది. మును ముందు భూగోళం మానవ నివాసయోగ్యంగా కొనసాగాలంటే—మన మందరమూ విభిన్న రీతులలో కార్యాచరణకు పూనుకోవాలి!''

విభిన్న రీతులలో కార్యాచరణకు దిగడం అంటే—ఎవరి స్థాయికి తగిన విధంగా వారు కృషిచేయడం అన్నమాట. ప్రభుత్వాలు కొత్త చట్టాలు రూపొందించి అమలుజరపాలి. ఐక్యరాజ్యసమితి సభ్యదేశాలన్నీ ఈ విషయంలో ఒక అవగాహనకు వచ్చి, సముద్రాలూ, ఆకాశం, పరిసరాలూ మరింత కలుషితం కాకుండా జాగ్రత్తపడాలి. ఇక, మనం చేయగలిగిందేమిటి? అడవులను నాశనం చేయడం వల్లా, వాతావరణ కాలుష్యం వల్లా ఏర్పడే దారుణమైన పర్యవసానాలనూ, వాటిల్లే అపాయాలనూ పదిమందికీ తెలియజేయడానికి కృషి చేయాలి!

సంపుటి 86   ఏప్రిల్ '90   సంచిక 4

విడి ప్రతి : 3-00   : :   సంవత్సర చందా : 36-00






# విజయచిత్ర

సినిమా వినోదానికి ప్రతినిధి
పాఠకులకు పరిశ్రమకూ వారధి

వర్ణచిత్రాలు కంటికి ఆనందం
తారల కబుర్లు మనసుకు ఆహ్లాదం

చూసినకొద్దీ చూడాలనిపిస్తుంది
చదివినకొద్దీ చదవాలనిపిస్తుంది

ప్రజాదరణే పునాదిగా



24 సంవత్సరాలుగా
నిర్విరామంగా, నిత్యనూతనంగా
వెలువడుతోంది...

తప్పక చదవండి - చదివించండి!

## విజయచిత్ర

చిత్రప్రియుల అభిమాన పత్రిక

## వార్తలు-విశేషాలు:

# అవినీతికి వ్యతిరేకంగా పోరాటం




జాతివివక్షత అనగానే, దానిని వ్యతిరేకించి పోరాటం సాగిస్తున్న మండేలా పేరూ, మండేలా పేరు వినగానే దక్షిణాఫ్రికాలోని తెల్లజాతి ప్రభుత్వం అనుసరిస్తున్న 'జాతివివక్షత' మనకు గుర్తుకు వస్తాయి. జాతివివక్షత అనే మాట వింటే చాలామందికి అసహ్యం, ద్వేషం కలుగుతాయి. అయితే మండేలా అనగానే ప్రేమాదరాలూ, గౌరవమూ, విశ్వాసమూ మన మనసులలో ఏర్పడతాయి.

ఆఫ్రికాఖండం దక్షిణాగ్రప్రాంతాన్ని దక్షిణాఫ్రికా అంటారు. మొదట శ్వేతజాతీయులు నాలుగు వలసప్రాంతాలుగా పరిపాలించిన—కేప్ ఆఫ్ గుడ్ హెూప్, నెటాల్, ట్రాన్స్‌వాల్, ఆరంజ్ ఫ్రీ స్టేట్—ఇందులోని భాగాలు. 1960 వ సం॥లో దక్షిణాఫ్రికా రిపబ్లిక్ అయింది. ప్రిటోరియా దీని రాజధాని. మూడుకోట్లకు మించిన జనాభా గల ఈ దేశ వైశాల్యం 12,21,037 చదరపు కి. మీ.

ప్రపంచంలోకెల్లా అత్యధికంగా బంగారమూ, వజ్రాలూ లభిస్తున్న దేశం దక్షిణ ఆఫ్రికా. అయినా ఇక్కడ కొనసాగుతున్న పరిపాలన, చాలా అసమగ్రమైనదీ, లోపభూయిష్టమైనదీను. ఎందుకంటే ఇక్కడి స్వదేశీయులూ, అధిక సంఖ్యాకులూ అయిన నల్లజాతి ప్రజలకు, అల్పసంఖ్యాకులయిన తెల్లజాతి వారితో సమానమైన హక్కులు లేవు. భిన్నజాతులకు భిన్నమైన చట్టాలుండా

లన్న జాతివివక్షతా సిద్ధాంతాన్ని శ్వేత జాతినేతలు అనుసరిస్తున్నారు.

వర్ణం ప్రాతిపదికగా కొన్ని జాతుల పట్ల వివక్షతను పాటించడం అవినీతి కరమైన హీనచర్య. ఈ దారుణస్థితిని వ్యతిరేకించి దక్షిణాఫ్రికా ప్రజలు జరుపు తూన్న పోరాటానికి ప్రపంచ వ్యాప్తంగా ప్రజలందరూ తమ మద్దతు తెలియ జేస్తున్నారు. నెల్సన్ మండేలా నాయ కత్వంలో ఆఫ్రికన్ నేషనల్ కాంగ్రెస్ ఈ విముక్తి పోరాటాన్ని సాగిస్తున్నది. తెల్లజాతి ప్రభుత్వం మండేలాను ఒకటి, రెండు సంవత్సరాలు కాదు—ఇరవై యేడు సంవత్సరాలు జైల్లో బంధించింది. ప్రపంచ వ్యాప్తంగా వచ్చిన ఒత్తిడి కార ణంగా, దక్షిణ ఆఫ్రికా ప్రభుత్వం ఇటీ వల నెల్సన్ మండేలాను విడుదల చేసింది. ఇప్పుడు ఆయన వయసు డెబ్బై ఒక్క సంవత్సరాలు.

మండేలా జైలులో వున్నప్పుడు, ఆయన సతీమణి విన్నీమండేలా ఈ జాతి విముక్తి పోరాటాన్ని నడిపింది.

తమ అణచివేతసిద్ధాంతం ఇకపై సాగదని శ్వేతజాతి ప్రభుత్వం గ్రహించి నట్టు తెలుస్తున్నది. ఇప్పటి దక్షిణాఫ్రికా అధ్యక్షుడు ఎఫ్. డబ్ల్యు. డీక్లార్క్— నల్లజాతి ప్రజలపై అమితద్వేషం పాటిం చిన తన పూర్వుల కంటే భిన్నంగా, వివేకంతో, వాస్తవిక దృష్టితో వ్యవహరిస్తు న్నట్టు చెప్పవచ్చు. మండేలాను విడుదల చేయాలన్న నిర్ణయం ఆయనే తీసుకున్నాడు. నల్లజాతి ప్రజల సమస్య లను గురించి డీక్లార్క్‌తో చర్చలు జరప డానికి మండేలా సంసిద్ధంగా వున్నాడు. అంతటా మంచితనం, పరస్పర సదవ గాహన ఏర్పడి అవినీతికరమైన జాతి వివక్షతావాదం అంతం కావాలని కాంక్షిస్తున్నాము.





# వల్లభయ్య సమస్య

విశ్వనాథపురంలో వల్లభయ్య అనే వ్యాపారి వుండేవాడు. ఆయనకు అరవైయ్యేళ్ళు వచ్చేసరికి, కొడుకు మహేంద్రుడు అంది వచ్చాడు. తండ్రి వ్యాపారం మహేంద్రుడు చూసుకో సాగాడు. వల్లభయ్యకు పూర్తి విశ్రాంతి లభించింది.

ఇంటిపట్టున వుంటున్న వల్లభయ్యకు ఏమీ తోచేదికాదు. వయసు పైబడిన చాదస్తంతో కొడుకు, కోడలు, భార్యలను తెగ విసిగించేవాడు.

ఆయన రుచికరమైన వంటలు వండించుకు తింటూ, పగలంతా హాయిగా గుర్రుపెట్టి నిద్రపోయేవాడు. దానితో రాత్రిళ్ళు సరిగా నిద్రపట్టేది కాదు. వల్లభయ్య అదేదో అనారోగ్యం అనుకుని తెగ బాధపడిపోయేవాడు. వచ్చీపోయే వాళ్ళందరితో దాన్ని గురించి పొద్దస్తమానం చెబుతూండేవాడు.

రాత్రిపూట సుఖంగా నిద్రపోతున్న వాళ్ళను చూస్తే, వల్లభయ్యకు బాధగా వుండేది. భార్య సుందరమ్మ మంచి నిద్రలో వుండగా, ఆమెను తట్టి లేపి, "వంటగది శుభ్రం చేశావా? పాలు జాగ్రత్తచేశావా? పిల్లి వచ్చి పాలు తాగేసి పోయేను," అంటూ ఏవేవో ప్రశ్నలు వేసేవాడు. అలాగే ఒక్కొక్కసారి కొడుకును నిద్ర లేపి, "కోడలు కనబడదేం? అబ్బాయికి అన్నం పెట్టిందా?" అని అడిగేవాడు.

నిద్రనుంచి లేపి, ఇలాంటి అర్థం లేని ప్రశ్నలడిగినందుకు, వాళ్ళందరికీ గొంతు వరకూ కోపం వచ్చేది. ఇంటికి పెద్దవాడని, ఏమీ అనలేక కోపాన్ని దిగమింగుకునేవాళ్ళు. అయితే, రానురాను పరిస్థితి శ్రుతిమించడంతో, వాళ్ళు వల్లభయ్యను తమ నిద్ర చెడగొట్టవద్దని గట్టిగా

ఎస్. శివనాగేశ్వరరావు



కోప్పడ్డారు. దానితో అయనకు ఏమీ తోచని పరిస్థితి ఏర్పడింది.

ఒక రోజు రాత్రి వల్లభయ్యా నిద్రపట్టక, ఇంటినుంచి బయలుదేరి, ఊరిచివర చెరువుగట్టున వున్న పెద్ద చింతచెట్టు దగ్గిరకు వెళ్ళాడు. చెట్టుకింద ఎవడో గురకపెట్టి నిద్రపోతూ, ఆయన కంట బడ్డాడు.

వల్లభయ్యకు వాణ్ణి చూసి చాలా అసూయ కలిగింది. ఇంట్లో పట్టెమంచం మీద పరుపుల మధ్య ఎంతసేపు పడు కున్నా తనకు కునుకూ్కడా రాదు. వీడెవడో చింతచెట్టు కింద కటికనేల మీద హాయిగా నిద్రపోతున్నాడు!

వల్లభయ్యా నిద్రపోతున్న వాడి కేసి కొంచెంసేపు చూసి, తర్వాత వాడి వీపు తట్టి లేపుతూ, "ఎవరు నువ్వు? రాత్రి వేళ ఇంత సుఖంగా నిద్రపోతున్నావు?" అని అడిగాడు.

వాడు చప్పునలేచి కూర్చుని, కంగారు పడుతూ పక్కన వున్న దుడ్డుకర్రను చేతిలోకి తీసుకుంటూ, "నువ్వెవరివి? ఇక్కడికి ఎందుకు వచ్చావు? దొంగవా, దయ్యానివా?" అని అడిగాడు.

వల్లభయ్యా దుడ్డుకర్ర కేసి బెదురుగా చూస్తూ, "నేను దొంగనూ కాదు; దయ్యాన్నీకాదు. నాకొక పెద్ద జబ్బున్నది. రాత్రిళ్ళు సరిగా నిద్రపట్టదు. మా ఇంట్లో అందరూ సుఖంగా నిద్రపోతారు. నిద్ర లేపితే వాళ్ళకు కోపం. అందుకే ఇలా వచ్చాను. ఏమైనా కబుర్లు చెప్పాకుంటూ కూర్చుంటే, రాత్రంతా ఇట్టే గడిచి పోతుంది," అన్నాడు.

అందుకు వాడు, "నేను రాత్రిళ్ళు ఊరుకాపలా తిరిగే గురవయ్యను. పగ లంతా ఇంట్లో తెగని పని. నా మనవళ్ళూ, మనవరాళ్ళూ నన్ను క్షణం ఒకచోట కూర్చోనివ్వరు. రాత్రి కాపలాపనుల్లో వుండేవాళ్ళు, పగలు నిద్రపోవాలి. అది నాకు సాధ్యపడడం లేదు," అన్నాడు బాధగా.

వల్లభయ్య ఒక క్షణం ఆలోచించి, "నీకు పగలు నిద్రపోవడం సాధ్యం కాదు, నాకు రాత్రిళ్ళు నిద్రపట్టదు. ఒక పని చేద్దామా. కాస్త వెన్నెల కూడా వున్నది. ఈ రాత్రంతా పులిజూదం ఆడుతూ కాలం గడిపేద్దాం," అన్నాడు.

"పులిజూదం ఆడేందుకు, నాకేం అభ్యంతరం లేదు. కాని, ఊరి కాపలా మాటేమిటి? ఎక్కడైనా దొంగలు పడితే, నా నౌకరీ పోతుంది. నువ్వన్నట్టు పులి జూదం ఆడదాం. అయితే, మధ్యలో అప్పు డప్పుడూ నువ్వుపోయి, నాలుగు వీధులూ తిరిగిరావాలి. ఆ విధంగా రాత్రిళ్ళు నిద్ర పట్టని నీకు, కాలక్షేపం అవుతుంది. నిద్ర అవసరం అయిన నేను కొద్దిసేపయినా సుఖంగా నిద్రపోతాను," అన్నాడు కాపలా గురవయ్య.

తర్వాత ఇద్దరూ పులిజూదం ప్రారం భించారు. కొద్దిసేపయ్యాక గురవయ్య పెద్దగా ఆవులిస్తూ, "నాకు నిద్రముంచుకు వస్తున్నది!" అంటూ అలాగే నేల మీద పడుకున్నాడు.

వల్లభయ్య, వాడి దుడ్డుకర్ర తీసుకుని ఊళ్ళోని నాలుగు వీధులూ తిరిగేందుకు బయలుదేరి వెళ్ళాడు.

ఇలా కొద్ది రోజులు జరిగాక, రాత్రి పూట తమను నిద్రలేపి విసిగించకుండా తండ్రి ఏం చేస్తున్నాడో తెలుసుకుందామని, మహేంద్రుడు ఒక రాత్రి మేలుకుని వున్నాడు. అర్ధరాత్రి సమయంలో






వల్లభయ్య వీధితలుపు తెరుచుకుని బయటకు వెళ్ళాడు.

మహేంద్రుడు రహస్యంగా తండ్రిని అనుసరించాడు.

వల్లభయ్య తిన్నగా చింతచెట్టు దగ్గిరకు వెళ్లాడు. కాపలా గురవయ్యా అప్పటికే అక్కడికి చేరి చింతచెట్టు కింద గుర్రు పెట్టి నిద్రపోతున్నాడు. వల్లభయ్య వాణ్ణి తట్టిలేపి, వాడితో కొంతసేపు పులిజూదం అడి, తర్వాత పక్కనే వున్న దుడ్డుకర్ర తీసుకుని ఎప్పటిలాగే ఊళ్ళోకి బయలుదేరాడు.

ఇది చూసిన మహేంద్రుడు, తన తండ్రి ఏమిచేస్తున్నాడో గ్రహించి ఇల్లు చేరాడు. ఆ రాత్రి అతడికి సరిగా నిద్ర పట్టలేదు. తన తండ్రి ప్రవర్తన గూర్చి తల్లికిగాని, భార్యకుగాని అతడు చెప్పలేదు. అయితే, తండ్రిలో మార్పు తేవడం ఎలాగో ఎంత ఆలోచించినా అతడికి తోచింది కాదు.

ఈ స్థితిలో పొరుగూరు నుంచి అతడి మేనమామ రుద్రయ్య అక్కడికి వచ్చాడు. మహేంద్రుడు మేనమామకు, తన తండ్రి ప్రవర్తన గురించి వివరంగా చెప్పి, ఏమి చేయడం బావుంటుందో ఆలోచించవలసిందిగా కోరాడు.

అందుకు రుద్రయ్య, "ఇందుకు పెద్దగా ఆలోచించవలసిందేమీ లేదు. మీ నాన్నను సరిదిద్దడం చాలా తేలిక. ఆ పని నేను చేస్తాను. ఈ రాత్రి నా పడక వీధివాకిలి దగ్గిర ఏర్పాటుచేసి, నాకు ఒక దుడ్డుకర్ర కూడా ఇవ్వు. తెల్లవారుజామునగదా, మీ నాన్న ఇంటికి తిరిగి వచ్చేది. అప్పుడు ఏం జరుగుతుందో, నువ్వు దూరానవుండి చూడు," అన్నాడు చిన్నగా నవ్వుతూ.

మేనమామ కోరిన విధంగానే చేశాడు, మహేంద్రుడు.

ఆ రాత్రి వల్లభయ్య మామూలు ప్రకారం ఇంటి నుంచి వెళ్ళి, కాపలా గురవయ్యతో పులిజూదం ఆడి, ఊరు

నాలుగు వీధులూ తిరిగి ఇంటికి బయలు దేరాడు.

ఆయన వీధివాకిలి చప్పుడు కాకుండా తెరిచి లోపలకు. రాగానే, రుద్రయ్య మంచం మీది నుంచి లేచి, దుడ్డుకర్రను వల్లభయ్యకు ఇస్తూ, "బావా, దీన్ని ఆ కాపలా గురవయ్యకు యివ్వడం మరి చావు!" అన్నాడు.

ఆ మాట విని వల్లభయ్య అదిరిపడి, "కాపలా గురవయ్యేమిటి? ఈ దుడ్డు కర్రేమిటి," అన్నాడు.

రుద్రయ్య పెద్దగా నవ్వి, "నువ్వు రాత్రివేళల్లో ఇల్లు వదిలి ఏం చేస్తున్నదీ నీ కొడుక్కూ, నాకూ తెలిసిపోయింది. ఈ సంగతి ఊళ్ళోవాళ్ళకూ కూడా తెలియడం జరిగితే, నువ్వు నవ్వులపాలవు తావు," అన్నాడు.

వల్లభయ్య తలపంకిస్తూ, "ఆ మాటా నిజమే! మరి నాకు రాత్రిళ్ళు నిద్రపట్టదు. ఏం చేయాలి? తెల్లవాళ్ళూ గోళ్ళు గిల్లుకుంటూ ఎలా కూర్చునేది," అన్నాడు.

"నీ నిద్రపట్టని సమస్యకు పులిజూదం, అపరాత్రివేళ ఊరికాపలా పరిష్కార మార్గాలు కావు. పగలంతా నిద్రపోకుండా ఏదో ఒక వ్యాపకం ఏర్పరచుకో. నీ మనవణ్ణి ఆడిస్తూ కాలక్షేపం చేయొచ్చు. హాయిగా పురాణగ్రంథాలు చదువుకోవచ్చు అన్నిటి కన్న ముఖ్యంగా మీ వ్యాపారానికి సంబంధించిన లెక్కలు రాస్తూండవచ్చు. ఈ విధంగా నీ కొడుక్కు కొంత భారం తగ్గుతుంది. నేనిక్కడ వారం రోజులు వుండబోతున్నాను. నే చెప్పినట్టు చెయ్యి. రాత్రిళ్ళు నీకెందుకు నిద్రపట్టదో నేనే చూస్తాను," అన్నాడు రుద్రయ్య చిన్నగా నవ్వుతూ.

వల్లభయ్యకు బావమరిది సలహా నచ్చింది. ఆయన ఆ రోజు నుంచే అతడు చెప్పినట్టు చేయడం ప్రారంభించాడు. పగలంతా ఏవో పనుల్లో మునిగి తేలుతూండడం వల్ల, వారం తిరక్కుండానే వల్లభయ్య రాత్రివేళల్లో హాయిగా నిద్రపోసాగాడు.



# కీర్తికాంక్ష

శోణగిరి రాజు మంచి చతురుడు. ఒకసారి ఆయన రాజ్యంలో, ఒక వింత ప్రకటన చేశాడు. ఏమాత్రం కీర్తికాంక్ష లేనివారికి రాజసభలో ఘనసన్మానం జరుగుతుందనీ, అందుకు అర్హుల మనుకున్నవారు ఫలాని రోజున సభకు రావలసిందనీ—ఆ ప్రకటన సారాంశం.

రావలసిన రోజు రానేవచ్చింది. కొందరు ప్రజలు రాజసభలో హాజరయ్యారు. రాజు వాళ్ళను చూసి నవ్వి, "మీరంతా ఈ సన్మానానికి అర్హులమని భావిస్తున్నారన్నమాట! సన్మానాన్ని కోరి వచ్చిన మీరు, కీర్తికాంక్ష లేనివారనడం శుద్ధ అబద్ధం, వెళ్ళిరండి," అన్నాడు.

అప్పుడు వాళ్ళలోంచి ప్రతిభుడనేవాడు ముందుకువచ్చి, "ప్రభూ, మిగిలినవారి సంగతేమోగానీ, నేను మాత్రం ఈ సన్మానానికి సంపూర్ణంగా అర్హుణ్ణి. నాకు కీర్తికాంక్ష అసలు లేదు!" అన్నాడు.

"అలా అయితే, సన్మానం కోసం ఎందుకొచ్చావు? ఇది కీర్తికాంక్ష కాదా?" అని ప్రశ్నించాడు రాజు.

దానికి ప్రతిభుడు, "ఇందుకొక కారణం వున్నది, ప్రభూ! నేను మా గ్రామాభివృద్ధికి ఎంతగానో పాటుబడ్డాను. అందుకు కృతజ్ఞతగా, మా గ్రామప్రజలు ఎన్నోసార్లు నాకు సన్మానం చేయాలని చూశారు. నాకు కీర్తికాంక్ష లేకపోవడమేకాదు; కీర్తి అంటే ఏవగింపు కూడా! అందువల్ల ఆ సన్మానాలన్నిటినీ తిరస్కరించాను. కాని, అనుకోని విధంగా, ఎంతో మేలు చేసి కూడా సన్మానాలను తిరస్కరించిన వాడిగా, నాకిప్పుడు కీర్తి వచ్చింది. కనీసం ఈ సన్మానమైనా చేయించుకోకపోతే, ఆ కీర్తి మరింత ఎక్కువయ్యే ప్రమాదం వున్నది. ఆ కారణంగా ఇలా వచ్చాను," అన్నాడు.

రాజు, అతడి చాతుర్యానికి మెచ్చి, సభలో ఘనంగా సన్మానం చేశాడు.

—వక్కలంక 'కిషోర్'





# బందిపోటు యువరాజు

## 8

[సుమేధ రాజ్య సింహాసనాన్ని కుట్రతో ఆక్రమించిన వీరసింహుడికి మనశ్శాంతి కరువయింది. వృద్ధమంత్రినీ, వసంతుణ్ణీ రక్షించిన ముసుగువీరు డెవరో తెలియడం లేదు. ఏ నిమిషాన ఎవరు తిరుగుబాటు చేస్తారో, ఎటువైపు నుంచి ఏ ఆపద ముంచుకు వస్తుందో అని ప్రతిక్షణం భయపడుతూ, అనుమానం కలిగినవారినందరినీ వేధించసాగాడు. —తరవాత]

క్రాలం గడిచేకొలదీ వీరసింహుడిలో ఓర్పు నశించింది. ఇరుగుపొరుగు రాజ్యాలను జయించాలన్న కోరిక అతనిలో ఎక్కువకాసాగింది. తన చిరకాలవాంఛను దళపతులకు తెలియజేశాడు. వాళ్ళందరూ అతని ఆజ్ఞకోసం ఎదురుచూస్తున్నారు. ఎందుకంటే పరాయిరాజ్యాలను జయిస్తే, వీరసింహుడితోపాటు తాము కూడా అక్కడి సంపదలను దోచుకుని రావచ్చునన్న పేరాశతో ఉన్నారు. వీరసింహుడు ఒకనాడు, తన అనుచరులలో ముఖ్యుడైన కపాలకంఠుడనే దళపతిని సేనాధిపతిగా నియమించాడు. మరునాటి రాత్రి, కపాలకంఠుణ్ణి తన రహస్యమందిరానికి పిలిపించి, "మనం పొరుగు రాజ్యాలపై దండెత్తవలసిన తరుణం ఆసన్నమయింది. ఏమంటావ్?" అని అడిగాడు వీరసింహుడు.



కపాలకంఠుడి ముఖం ఆనందంతో వెలిగిపోయింది. వాడు వీరసింహుడికి నమస్కరించి, "నేనూ, అదే అనుకుంటున్నాను ప్రభూ. మనం పొరుగు రాజ్యంపై యుద్ధం ప్రకటించామంటే ప్రజల దృష్టి అటు మళ్ళిపోతుంది. యుద్ధంలో జయమా, అపజయమా అన్న విషయం గురించే వారి ఆలోచనలు వుంటాయి కాబట్టి, తమరంటే ఇప్పుడున్న అసంతృప్తి తగ్గుతుంది. పైగా పొరుగు రాజ్యాలను జయించామంటే, ఆ రాజ్యాల లోని సంపదలన్నీ మన వశమవుతాయి. ఆ విధంగా మన రాజ్య భోగభాగ్యాలు పెరుగుతాయి కాబట్టి, తమరి పట్ల మన ప్రజల ఆదరాభిమానాలు ఇనుమడిస్తాయి," అన్నాడు కపాలకంఠుడు.

"అవును. నువ్వన్నది ముమ్మాటికీ నిజం. సరే, మనం మొట్టమొదట ఏ రాజ్యం మీదికి దండెత్తడం బావుంటుంది?" అని అడిగాడు వీరసింహుడు.

"ప్రభూ, ఈ విషయం గురించి నేను ముందే బాగా ఆలోచించాను. మనం మన దండయాత్రను అమృతపురి నుంచి ప్రారంభించాలి. ఎందుకంటే, అమృతపురి రాజు సత్యసేనుడు శాంతిదేవుడి మామ. అతడు మీ మీద ద్వేషంతో మీకు హాని కలిగించడానికి ఈ సరికే ఏదైనా పథకం ఆలోచించి వుండవచ్చు. అందుకే అమృతపురి నుంచి వచ్చిన ప్రయాణీకులందరినీ, ఆ రాజ్యపు వేగులేమో అన్న అనుమానంతో ఖైదు చేయమన్నాను," అన్నాడు కపాలకంఠుడు.

ఆ మాటలకు వీరసింహుడు తల పంకిస్తూ, "నీ అభిప్రాయంతో మేమూ ఏకీభవిస్తున్నాము. సత్యసేనుడు అనారోగ్యం పాలయ్యాడని వేగుల ద్వారా తెలిసింది. ఇది మనకొక అద్భుత అవకాశం. వెళ్ళి వెంటనే యుద్ధ సన్నాహాలు ప్రారంభించు. అయినా, నది దాటడానికి కావలసినన్ని పడవలు మన వద్ద వున్నాయా?" అని అడిగాడు.

"ఆయుధాలను దాటవేయడానికీ, దళపతులు నది దాటడానికి కావలసిన పడవలకు మనవద్ద లోటు లేదు. ఇక మామూలు సైనికులు ఈదుతూ నదిని దాటవచ్చు. ఎందుకంటే ఈ రుతువులో సుమతీనది రొమ్ములలోతే ప్రవహిస్తుంది," అన్నాడు కపాలకంఠుడు.

"మంచిది. మరి, నది దాటడానికి నువ్వు ఎన్నాళ్లలో సైన్యాన్ని సిద్ధం చేయగలవు?" అని అడిగాడు వీరసింహుడు.

"ప్రభువులు ఆజ్ఞాపించారంటే రేపే సిద్ధం చేస్తాను," అన్నాడు కపాలకంఠుడు.

"శభాష్. సేనాధిపతి అంటే ఇలా వుండాలి. నిన్ను ఘనంగా సత్కరిస్తాము. అయితే ఇప్పుడు కాదు; అమృతపురిని జయించి తిరిగి వచ్చాక. ఎల్లుండి రాత్రే నదిని దాటడానికి సైన్యాన్ని సిద్ధం చెయ్," అన్నాడు వీరసింహుడు.

"ప్రభువులు మహా మేధావులు! ఎల్లుండి పౌర్ణమి. మన సేనలు రహస్యంగా నదిని దాటి, హఠాత్తుగా అమృతపురి రాజధాని మీద పడినట్టయితే, ఏమరుపాటుతో వున్న ఆ రాజ్యం తెల్లవారేసరికి మన వశం అవుతుంది కదా!" అన్నాడు కపాలకంఠుడు.

వీరసింహుడు నవ్వుతూ, కపాలకంఠుడి వీపు తట్టాడు. కపాలకంఠుడు



అతనికి నమస్కరించి అక్కడి నుంచి బయలుదేరాడు.

ఆ రాత్రే కపాలకంఠుడు దళనాయకుల సమావేశం ఏర్పాటు చేసి, వీరసింహుడి నిర్ణయం తెలియజేశాడు. ఆ సంగతి విని దళనాయకులందరూ పరమానందభరితులయ్యారు. ఎందుకంటే అమృతపురి సేనలు తమ సేనలను యుద్ధంలో ఎదుర్కొన లేవని వారికి తెలుసు. తమకన్న బలహీనులను దెబ్బతీయడంలో అల్పులకు అమితానందం వుంటుంది. పైగా అమృతపురి ప్రజలు ధనవంతులు. యుద్ధానంతరం అక్కడి సంపదలన్నీ తమ వశమవుతాయని దళనాయకులు



"ఎక్కడినుంచి తిరిగి వచ్చిన తరవాత?" అని అడిగాడు దుకాణం యజమాని.

"నది దాటి వెళ్ళి తిరిగి వచ్చిన తరవాత. సరే, ఈ విషయం గురించి ఇక నన్నేమీ ప్రశ్నించకు," అన్నాడు ఆ దళ నాయకుడు.

"ఎప్పుడు తిరిగి వస్తావేంటి?" అని అడిగాడు దుకాణం యజమాని మళ్ళీ.

"రేపు తరవాత ఎప్పుడయినా తిరిగి రావచ్చు; ఎందుకంటే ముట్టడి జరప బోయేది రేపు రాత్రికే కదా!" అన్నాడు దళనాయకుడు చిన్నగా నవ్వుతూ.

భావించారు. ముట్టడి ఎలా జరపాలో అందరూ కలిసి పథకం వేశాక, కపాల కంఠుడు, "ఈ క్షణంనుంచే యుద్ధ సన్నాహాలు ప్రారంభంకావాలి. ఈ రహస్యం బయటకు పొక్కిందో మీ ప్రాణాలు దక్కవు. జాగ్రత్త!" అని హెచ్చరించాడు.

అయినా, ఒక దళనాయకుడు అక్కడి నుంచి సరాసరి ఒక పానశాలకు వెళ్ళి, కూర్చుని పానం సేవిస్తూ దుకాణం యజమానితో, "నీకు నేను యాభై వెండి నాణాలు బాకీపడ్డానుకదా. మరేమీ దిగులు పడకు. నేను తిరిగి వచ్చిన వెంటనే, వెండి నాణాలేం ఖర్మ నీకు యాభై బంగారు నాణాలే ఇస్తాను," అన్నాడు.

దుకాణం ముందు కూర్చున్న యువకు డొకడు అక్కడి సంభాషణలను జాగ్రత్తగా వింటున్నాడన్న విషయం వాళ్ళు గమనించ లేదు. చూడడానికి బికారిలా వున్నప్పటికీ ఆ యువకుడి కళ్ళల్లో అచం చలమైన ధైర్యం, వివేకం స్పష్టంగా కని పిస్తున్నాయి. అతడే వసంతుడు. అమృత పురిలో వున్నప్పటికీ, వసంతుడు తన రాజ్యంలో ఏంజరుగుతున్నదో తెలుసుకోవా లన్న ఆసక్తితో, రకరకాల మారు వేషాలు ధరించి సుమేధ రాజ్యమంతటా తిరు గుతూ, శక్తిసంపన్నులయిన యువకులను తన పక్షానికి చేర్చుకుంటున్నాడు. వీర సింహుడి దుష్టపాలనను కొనసాగనివ్వ

కూడదు. దాని అంతం చూడాలి. అయినా అది ఎలా ఎప్పుడు సాధ్యమవుతుందో మాత్రం అతనికి తెలియదు. కాని, వీరసింహుడు విధించిన మరణశిక్ష నుంచి తనను కాపాడిన ముసుగువీరుడిపట్ల వసంతుడికి అచంచలమైన విశ్వాసం వున్నది. ముసుగు వీరుడు అప్పుడప్పుడూ, "వీరసింహుడి దురాగతాల నుంచి మనం అమాయక ప్రజలను తప్పక రక్షించాలి. అయితే, అలా చేయడంలో మనం అనవసరంగా ఏ ఒక్కరికీ—వారు వీరసింహుడి భటులయినా సరే హాని కలిగించకూడదు. ఎందుకంటే సైనికులు గాని, దళనాయకులు గాని నాయకుడి ఆజ్ఞను తలదాల్చే వాళ్ళేకదా. అయితే ఏ అధికారి అయినా; మన హెచ్చరికను లక్ష్యపెట్టకుండా, అమాయక ప్రజలనూ, స్త్రీలనూ హింసించినట్టయితే, చూస్తూ ఊరుకోరాదు. వారిని శిక్షించడానికి వెనుకాడ కూడదు," అని అనేవాడు.

ఎంత పరిశీలనగా చూసినా, ఆ ముసుగు వీరు డెవరో పోల్చుకోవడానికి వసంతుడికి సాధ్యపడలేదు. ఆ విషయం అడిగితే, "కాలం ఆసన్నమయినప్పుడు నీకే తెలుస్తుంది. ఏ విషయంలోగాని తొందరపాటు పనికి రాదు," అనే వాడు ముసుగు వీరుడు గంభీరమైన కంఠస్వరంతో.



వసంతుడు మౌనంగా దుకాణం నుంచి బయటకు వచ్చాడు. ద్వారం ముందు చీకటిగా వున్నది. అక్కడ ఒక స్తంభానికి దళనాయకుడి గుర్రం కట్టబడి వున్నది. వసంతుడు చుట్టుపక్కల కలయచూసి గుర్రాన్ని సమీపించి, మెల్లగా దానిని మచ్చిక చేసుకుని, జాగ్రత్తగా కట్టువిప్పి, సద్దుకాకుండా చీకటిలో గుర్రాన్ని మరికొంత ముందుకు నడిపించి, ఒక్క ఊపుతో గుర్రం మీదికి లంఘించి కూర్చుని ముందుకు అదిలించాడు.

ఒక గంటసేపట్లో అతడు సుమతీనదీ తీరాన్ని చేరుకుని, గుర్రాన్ని అక్కడే వదిలి, లోతు తక్కువగా వున్నచోట



నదిని ఈదుకుంటూ మరొక గంటసేపట్లో అవతలి గట్టున వున్న అమృతపురిని చేరుకున్నాడు. అమృతపురి చిన్న నగరం. శాంతిప్రియులైన ఆ నగర ప్రజలందరూ గాఢనిద్రలో వున్నారు. వసంతుడు తిన్నగా మంత్రి భవనం దగ్గరికి వెళ్ళి కాపలా భటులతో తక్షణమే మంత్రిని చూడాలన్నాడు. సమయానికి మంత్రి కూడా మేలుకొని వుండడంతో, ఆయన వసంతుడి కంఠస్వరంలోని ఆత్రుతను గమనించి, అతణ్ణి లోపలకు పంపమని భటులను ఆజ్ఞాపించాడు.

వసంతుడు లోపలికి వెళ్ళి, వీరసింహుడి దురాక్రమణ పథకం గురించి మంత్రికి తెలియజేశాడు. మంత్రి వెంటనే తమ సేనాధిపతిని రప్పించి, ఇరువురూ కలిసి రాజభవనానికి బయలుదేరారు.

అనారోగ్యంతో వున్న సత్యసేనుడు మంత్రి చెప్పిన వార్త విని, "నా అల్లుడూ, కుమార్తె దూరమయ్యారు. ఇప్పుడు రాజ్యం కూడా శత్రువుల వశమయ్యేట్టున్నది!" అన్నాడు విచారంగా నిట్టూరుస్తూ.

"నా శరీరంలో చివరి నెత్తుటి బొట్టు వున్నంతవరకూ మన రాజ్యాన్ని రక్షిస్తాను ప్రభూ," అన్నాడు సేనాధిపతి.

"నీ రాజభక్తి నేనెరిగినదే. కాని, సుమేధతో పోలిస్తే మన సైనికబలం మరీ స్వల్పం కదా? మొదట మీరు నదీతీరం చేరుకుని, శత్రువులు రాగానే వారితో సంధి చేసుకోవడానికి ప్రయత్నించండి. మనం సుమేధకు కప్పం చెల్లించడానికి కూడా సిద్ధంగా వున్నట్టు చెప్పండి," అన్నాడు రాజు.

మంత్రీ, సేనాధిపతీ కొంతసేపు మౌనం వహించారు. ఆ తరవాత మంత్రి, "ప్రభూ, మీ ఆజ్ఞానుసారమే నడుచుకుంటాం. ప్రస్తుత పరిస్థితులలో అదే సరైన మార్గంగా నాకూ అనిపిస్తున్నది. కాని, మన ప్రతిపాదనను వాళ్ళు గౌరవించి అంగీకరించకపోతే, యుద్ధం తప్పదు కదా!" అన్నాడు.

రాజు మరేమీ మాట్లాడకుండా మౌనం వహించాడు.

పథకం ప్రకారం పౌర్ణమినాటి రాత్రి వీరసింహుడి సేనలు సుమతీనది తీరానికి చేరాయి. అమితోత్సాహంతో ఆయుధాలను పడవలలోకి ఎక్కించారు. దళపతులు కూడా మరికొన్ని పడవలలోకి ఎక్కారు. ఆ తరవాత, కపాలకంఠుడు మిగతా సైనికులను, "మీరందరూ ఒక్కసారిగా నదిలోకి దిగి ఈదుకుంటూ అవతలిగట్టు చేరుకోండి," అని ఆజ్ఞాపించాడు.

పక్కనే వున్న వీరసింహుడు కపాల కంఠుడి కేసి గర్వంగా చూస్తూ తనూ ఒక పడవపై బయలుదేరాడు.

నదికి ఆవలిగట్టున అమృతపురి సేనలు గుమిగూడాయి. వీరసింహుడు రాగానే అత నితో మాట్లాడి సంధి కుదుర్చుకోవడానికి అమృతపురి మంత్రి సిద్ధంగా వున్నాడు.

ఆ సమయంలో ఉవ్వెత్తుగా ఉప్పెన లేచినట్టు హఠాత్తుగా భయంకరమైన శబ్దం వినిపించింది. మరుక్షణమే, వీరసేనుడి సేనల హాహాకారాలు మిన్ను ముట్టాయి. నదికి ఎగువన దూరంగా ఎక్కడో కొండ లలో వర్షం కురిసి, హఠాత్తుగా వెల్లువ రావడంతో పడవలన్నీ తల్లకిందు లయ్యాయి. నదిలో ఈదుతున్న సైనికు లందరూ ప్రవాహంలో కొట్టుకుపోయారు. ఎంతమంది వెల్లువకు బలయ్యారో, మరెంతమంది బతికి బయటపడ్డారో తెలియలేదు. వీరసింహుడు, కపాల కంఠుడు మాత్రం వెంట్రుకవాసిలో అపాయం నుంచి బయటపడి, ప్రాణాలతో తప్పించుకున్నారు. కొన్ని నిముషాలలో ఆ ప్రాంతమంతా మళ్ళీ ప్రశాంతంగా కనిపించింది.

ఆనందకరమైన ఈ హఠాత్ పరిణామం గురించి విన్న అమృతపురి రాజు సత్య సేనుడు, "ఈ ఆపదనుంచి ఆ భగవం తుడే మనల్ని రక్షించాడు. అయినా, మునుముందు మనం ఎలాంటి దాడినైనా ఎదుర్కోవడానికి సిద్ధంగా వుండాలి!" అన్నాడు మంత్రితో. —(ఇంకావుంది)






# బానిసల సంకెళ్ళు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, భీతికొలిపే ఈ శ్మశానంలో ఇంత అర్ధ రాత్రివేళ, నువ్వు పడుతున్న శ్రమ చూస్తూంటే, నాకు ఆశ్చర్యంతోపాటు, ఒక అనుమానం కూడా కలుగుతున్నది. అదేమంటే—నువ్వు రాజ్యపాలనను ఎవరికి అప్పగించి వచ్చావన్నది. బహుశా దాన్ని నువ్వు విశ్వాసపాత్రులనుకున్నవారి హస్తగతం చేసి వుంటావు. ఒకవేళ నువ్వు లేని సమయంలో వాళ్ళు నిరంకుశులూ, లంచగొండులూ అయితే, వాళ్ళను కఠినంగా శిక్షించగలవా? ఇలాంటి సమస్య ఎదురైనప్పుడు, శత్రుంజయుడనే రాజు ఎలా ప్రవర్తించాడో, నీకు శ్రమ

## బేతాళ కథలు



తెలియకుండా వుండేందుకు చెబుతాను, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

ఒకానొకప్పుడు భువనగిరి దేశాన్ని శత్రుంజయుడనే రాజు పరిపాలిస్తూండే వాడు. ఆయనకు పదవీకాంక్షకంటే ప్రజాక్షేమమే ఎక్కువ. అందుకని ఆయన రాజ్యాన్ని వంద భాగాలుగా విభజించి, ప్రతి భాగానికీ ఒక అధికారిని నియమించి, వారికే సర్వాధికారాలూ అప్పజెప్పేశాడు.

న్యాయం కోసం పేదా, గొప్పా కూడా రాత్రీ పగలూ భేదం లేకుండా శత్రుంజయుణ్ణి కలుసుకునే సదుపాయం వున్నది. చాలాకాలంగా న్యాయంజరిపించమని రాజును కోరినవాళ్ళెవరూ లేక పోవడంతో, తన పాలనలో ప్రజలు ఎటువంటి కొరతా లేకుండా సుఖపడుతున్నారనే ఆయన అనుకున్నాడు.

అలా కొన్నేళ్ళు జరిగాయి. ఒక రోజున శరశ్చంద్రుడనేవాడు, శత్రుంజయుణ్ణి దర్శించి, ''ప్రభూ! తమరు రాజ్యాన్ని వంద భాగాలుగా విభజించి, వాటికి అధికారుల్ని నియమించి, సర్వాధికారాలూ వాళ్ళకే యిచ్చేశారు. ప్రజలనుంచి పన్నులు వసూలుచేసి తమకు సక్రమంగా అందిస్తే, పౌరులందరూ సుఖంగా వుంటున్నారని తమరు భావిస్తున్నారు. కానీ, తమరు నియమించిన అధికారులు కొందరు నిరంకుశులై అవినీతికి పాల్పడి ఎన్నో అక్రమాలూ, అన్యాయాలూ చేస్తున్నారు. అదేమని ఎదురుతిరిగిన నావంటివాణ్ణి, నానా హింసలకూ గురిచేసి నిలువ నీడ లేకుండా చేస్తున్నారు,'' అని ఫిర్యాదు చేశాడు.

శత్రుంజయు డాశ్చర్యపడి, ''నీకు జరిగిన అన్యాయమేమిటో చెప్పు, నివారిస్తాను,'' అన్నాడు.

''నేనుండే భాగానికి వీరదత్తుడు అధికారి. ఆయన లంచగొండి. తనకు డబ్బిచ్చిన అసమర్థులందరికీ మంచి ఉద్యోగాలిస్తున్నాడు. తమకు తెలియని ఎన్నో కొత్త పన్నులు విధించి వసూలు

చేస్తూ, వాటితో విలాసంగా కాలం గడుపుతున్నాడు. పండుగలకు ప్రజలందరూ, ఆయనకు విలువయిన కానుకలిచ్చుకోవాలని శాసించాడు,'' అని చెప్పాడు శరశ్చంద్రుడు.

''అదంతాసరే! అయినా, నీకు జరిగిన అన్యాయమేమిటో చెప్పు,'' అని అడిగాడు రాజు.

''ప్రభూ! అవినీతిపరులను పట్టుకునే ఉద్యోగాన్ని, వీరదత్తుడు నాకు యిచ్చాడు. ఆ ప్రకారం నేనెందరో అవినీతిపరులను పట్టుకున్నాను. వీరదత్తుడు వారి పక్షానే పలికి, నన్ను మందలించి వారిని వదలిపెట్టేశాడు. అందువల్ల అవినీతిపరులందరికీ, నేనంటే వేళాకోళంగా వున్నది. వాళ్ళు విశృంఖలంగా వ్యవహరిస్తూంటే చూడలేక, ప్రజలందరికీ వాళ్ళను గురించి చెప్పడం మొదలు పెట్టాను. దానితో వీరదత్తుడు నన్ను ఉద్యోగంలోంచి తొలగించాడు,'' అన్నాడు శరశ్చంద్రుడు.

''నీ ఉద్యోగం నీకు మళ్ళీ ఇప్పించాలా?'' అని ప్రశ్నించాడు రాజు.

''వద్దు, ప్రభూ! నాకు వ్యాపారం చేయగల తెలివీ, పదిమందికి చదువు చెప్పగల పాండిత్యం వున్నాయి. వాటితో ఈ రాజధానిలో సుఖంగా బతుకుదామని వచ్చాను. సక్రమంగా చేయలేనప్పుడు,



ఉద్యోగం నాకెందుకు? తమరొకసారి స్వయంగా వెళ్ళి, వీరదత్తుడి పాలన ఎలా వున్నదో చూసి రావాలని, నా కోరిక,'' అన్నాడు శరశ్చంద్రుడు.

శత్రుంజయుడు అతణ్ణి పంపివేసి, మర్నాడే వీరదత్తుడు పాలిస్తున్న ప్రాంతానికి బయల్దేరి వెళ్ళాడు. వీరదత్తుడు ఆయనకు ఘనంగా మర్యాదలు చేశాడు.

రాజు వాడితో, ''నీ మర్యాదలతో నాకు పని లేదు. కొంతకాలం పాటు నేను ఇక్కడే వుండి, ప్రజల కష్టసుఖాలను స్వయంగా విచారించాలనుకుంటున్నాను. ఆ విధంగా ప్రకటన చేయించు,'' అని చెప్పాడు.



ఆ విధంగా ప్రకటన జరిగింది. అది విని రాజదర్శనానికి ఎందరో వచ్చారు. ఒక రైతు, రాజును, "ప్రభూ! నాకు పదెకరాల భూమి వున్నది. మామూలుగా కట్టే పన్ను కాక వీరదత్తుడు, నా నుంచి ఎకరానికి రెండుబస్తాల ధాన్యం అదనంగా తీసుకున్నాడు. పదేళ్ళుగా ఇలా జరుగుతున్నది. నా రెండువందల బస్తాల ధాన్యం నాకు తిరిగి యిప్పించండి," అని కోరాడు.

ఒక అడపిల్ల తండ్రి వచ్చి, "ప్రభూ! నా కూతురుకు మంచి సంబంధం వచ్చింది. వెయ్యి వరహాలు కట్నంగా యిచ్చాను. వీరదత్తుడు కట్న మిచ్చిన నేరానికి నన్ను కారాగారంలో వేయిస్తానన్నాడు. అయిదువందల వరహాలిస్తే, నా నేరాన్ని క్షమించాడు. కట్నా లివ్వందే అడపిల్లల పెళ్ళిళ్ళు జరగవు. ఇప్పుడు కట్నానికి తోడుగా, వీరదత్తుడి కిచ్చుకోవలసిన సుంకమొకటి! మమ్మల్ని ఈ పీడ నుంచి రక్షించండి!" అన్నాడు.

ఒక మగపిల్లవాడి తండ్రి, "ప్రభూ! నా కొడుక్కు కట్నం తీసుకోకుండా పెళ్ళి చేద్దామనుకుంటే, వీరదత్తుడు ఒప్పుకోలేదు. బలవంతంగా నాచేత కట్నం తీసుకునేలా చేసి, అందులో తనూ కొంత వాటా తీసుకున్నాడు," అని చెప్పాడు.

ఆ ప్రాంతాన వ్యాపారస్థు లందరూ వంతులవారీగా, వీరదత్తుడి అవసరాలకు డబ్బు ముట్టజెబుతున్నారు. కళాకారులు వీరదత్తుడికి వంతులవారీగా వినోదాలు కలిగిస్తున్నారు. ఎక్కడ చూసినా అవినీతి, అక్రమం, అన్యాయం!

ఇవన్నీ వినేసరికి రాజుకు తల తిరిగిపోయింది. ఆయన కొందరు ఉద్యోగులను పిలిచి, "వీరదత్తుడు మిమ్మల్ని నియమించి వుండవచ్చు. కానీ, మీకు జీతంగా వస్తున్నది ప్రజలసొమ్ము. మీరు ప్రజలకు సరైన న్యాయం చేకూర్చలేదు. ఇక్కడ జరిగే అన్యాయాల గురించి, నాకు చెప్పలేదు. కారణం ఏమిటి?" అని అడిగాడు.

అందుకు ఉద్యోగులు తలలు వంచి, "ప్రభూ! తమరు వీరదత్తుడికి సర్వాధికారాలూ యిచ్చారు. వాటితో ఆయన ఏమైనా చేయగలడు. వీరదత్తుడి మాట విననందుకు, శరశ్చంద్రుడనే ఉద్యోగి, ఈ ప్రాంతాన్ని విడిచిపోవలసి వచ్చింది. మాకు అంత ధైర్యం, తెగింపూ లేవు," అన్నారు.



అప్పుడు రాజు శత్రుంజయుడు, వీరదత్తుణ్ణి పిలిచి, తను విన్న ఆరోపణలన్నీ వాడికి చెప్పి, "వీటికి నీ సమాధానం ఏమిటి?" అని ప్రశ్నించాడు.

"ప్రజలందరూ ఒక్కటై, నన్ను గురించి ఇలా అంటున్నప్పుడు, నేను మాత్రం కాదన గలనా, ప్రభూ? నాకు ఒక్క సంవత్సరం గడు వివ్వండి. నన్ను నేను సంస్కరించుకుని బాగవుతాను," అన్నాడు వీరదత్తుడు.

అలా చేయవద్దని ప్రజలందరూ వేడుకున్నప్పటికీ, వినకుండా రాజు వీరదత్తుడికి సంవత్సరం గడువిచ్చి వెళ్ళి పోయాడు.

ఈ సంవత్సరంలోనూ వీరదత్తుడు బాగుపడలేదు సరికదా, తనమీద ఫిర్యాదు చేసినవాళ్ళందరి మీదా దారుణంగా పగ తీర్చుకున్నాడు. దానితో అక్కడ కలకలం రేగి ప్రజలందరూ తిరగబడ్డారు. తమలో నుంచి కొందరు నాయకులనెన్నుకుని, శత్రుంజయుడికి రాయబారంగా, "తమరు మాకు మంచి అధికారిని నియమించండి. ఇప్పుడున్న వీరదత్తుణ్ణి కఠినంగా శిక్షించండి," అని కబురు పంపారు.

రాజు శత్రుంజయుడు, వీరదత్తుడికి ఏ కఠినశిక్ష విధించకుండా, పదవి నుంచి మాత్రం తొలగించి, శరశ్చంద్రుణ్ణి ఆ ప్రాంతాలకు అధికారిగా నియమించాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, శత్రుంజయుడి ప్రవర్తన అసమంజసంగా, అసందర్భంగా లేదా? ఒక్క శరశ్చంద్రుడనేవాడు ఫిర్యాదు చేయగానే ఆయన, తాను నియమించిన అధికారి పాలన ఎలా వున్నదో తెలుసుకునేందుకు వెళ్ళాడు.

కాని, ఎందరో ప్రజలు వీరదత్తుడి ఆగడాల గురించి మొరబెట్టుకున్నా, వాడికి మరొక సంవత్సరం గడు విచ్చాడు. వాడు తన శత్రువులపై పగ తీర్చుకుంటాడని, రాజుకు తెలియదా? చివరకు వీరదత్తుణ్ణి పదవి నుంచి మాత్రం తొలగించి వూరుకున్నాడు. వాణ్ణి కఠినంగా ఎందుకు శిక్షించలేదు? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "శత్రుంజయుడి ప్రవర్తనలో అసమంజసం, అసందర్భం అంటూ ఏమీ లేదు. శరశ్చంద్రుడు తన కోసం కాక ప్రజల కోసం బాధ పడి, రాజుకు ఫిర్యాదు చేశాడు. అందుకే రాజు వెంటనే బయలు దేరి వెళ్ళాడు. ప్రజలు ఎవరికివారు తమ కష్టాల గురించి మాత్రమే రాజుకు చెప్పు కున్నారు. ఎంతోకాలంగా వీరదత్తుడు తమను కష్టాలపాలు చేస్తున్నా, రాజు అడిగేవరకూ ప్రజలు వాటిని గురించి ఆయనకు ఫిర్యాదు చేయలేదు. అంతే కాక, తనకోసం పాటుబడ్డ శరశ్చంద్రుడికి కూడా వాళ్ళెలాంటి సాయం చెయ్యలేదు. అంటే, వాళ్ళందరూ పిరికివాళ్ళూ, అవకాశవాదులూ అన్న మాట. అందుకే వాళ్ళలో చైతన్యం కలిగించాలని, రాజు వీరదత్తుడికి మరొక సంవత్సరం గడు విచ్చాడు. ఆ తర్వాత అంతా అనుకున్నట్టే జరిగింది. బానిసల సంకెళ్ళను ఎవరో వచ్చి పగులగొట్టరు! వాళ్ళకు వాళ్ళే పగులగొట్టుకోవాలి. ఈ సంగతి క్రమంగా ప్రజలు గుర్తించారు. ప్రజల సహనం, పిరికితనం వీరదత్తుణ్ణి దుర్మార్గుడుగా చేసింది. అలాంటి వాణ్ణి పదవీచ్యుతుణ్ణి చేయడమే కఠినంగా శిక్షించడం. ఎందుకంటే, వాడిప్పుడు ప్రజాద్వేషానికి గురై వున్న కోరలు పీకిన పాము," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)

[ఆధారం: "వసుంధర" రచన]





# చిలుక పలుకు

ఒక ఊళ్ళో కొంచెం ఆస్తిపరురాలైన ముసలావిడ ఉండేది. ఆవిడకు ఒక మనవరాలు తప్ప మరెవరూ లేరు. ముసలిది ఆ మనవరాలిని ఎంతో కట్టుదిట్టంలో ఉంచి భయభక్తులతో పెంచేది. ఆ పిల్ల బయటికి వెళ్ళి తన యీడు పిల్లలతో ఆడుకోరాదు. ఆ పిల్లలు ఈ పిల్ల కోసం రాగూడదు!

మనవరాలికి ఇల్లు బందిఖానా లాగుండేది. ఇంట్లో అవ్వా, ఒక రామచిలుకా తప్పిస్తే ఇంకేమీ లేదు. ఇతర పిల్లలు స్వేచ్ఛగా తిరుగుతూ, ఆడుతూ, పాడుతూ, కేరింతలు కొడుతుంటే మనవరాలికి ముసలిదానిపైన మండిపోయేది. కాని ముసలిదంటే చెడ్డ భయం కావటం చేత ఆవిడ ఎదట కుక్కిన పేనులాగా, అమాయకంగా ఉండేది; ముసలిది లేనప్పుడు మాత్రం కసికొద్దీ, "ఈ ముసలిది పోయినా బాగుండును!" అని పైకే అనుకునేది.

వినగా వినగా రామచిలుకకు ఈ మాటలు నోటపట్టాయి. అది ఒకనాడు ముసలిది వింటూండగా, "ఈ ముసలిది పోయినా బాగుండును!" అనేసింది.

ముసలమ్మ ఈ మాటలకు నిర్ఘాంత పోయింది. అస్తమానం ఇంట్లోనే ఉండే రామచిలక్కి ఇలాటి పాపిష్టి మాటలు ఎలా వస్తాయి? ఆవిడకు తన మనవరాలి పైన అనుమానం తగల్లేదు. ఎంచేతంటే, నోట్లో నాలుక లేనట్టు కనిపించే ఆ పిల్ల నిష్కారణంగా అటువంటి మాటలు ఎందు కంటుంది?

ఒకనాడు ముసలావిడతో తమ ఇంటి విషయం ఏదో చెప్పుకోవటానికి పొరుగింటి ముసలామె వచ్చింది. ఇద్దరూ మాట్లాడుకునే సమయంలో రామచిలుక తపీమని,

''ఈ ముసలిది పోయినా బాగుండును!'' అన్నది. ఈ మాటలు వింటూనే పొరుగింటి ముసలమ్మ వెలవెలపోయి, మాట్లాడే మాట కూడా పూర్తి చెయ్యకుండా, గిరుక్కున తిరిగి వెళ్ళిపోయింది. ముసలిదానికి తల తీసేసినట్టయింది.

ఎలాగైనా ఆ చిలుక చేత ఇటువంటి మాటలు మాట్లాడకుండా చేయించాలని ముసలిదానికి అనిపించింది. పొరుగునే ఒక శాస్త్రుల్లుగారున్నాడు. వారింట కూడా ఒక రామచిలుక ఉన్నది. అందుచేత చిలుకల సంగతి ఆయనకు బాగా తెలుసు.

ముసలిది శాస్త్రుల్లుగారింటికి వెళ్ళి, ''అయ్యా, మా చిలక పాపిష్టి మాటలు నేర్చింది. ఎవరైనా ఇంటికిరా భయంగా ఉంటున్నది. దానికి కాస్త మంచిమాటలు అలవడే దారి చెబుదురూ,'' అన్నది.

శాస్త్రుల్లుగారు, ''అదేమంత కష్టమైన పనికాదే. మా చిలుక చాలా మంచి మాటలు మాట్లాడుతుంది. దాని నోట ఎన్నడూ ఒక్క చెడ్డమాట రాదు. కావలిస్తే మా చిలుకను మీ చిలుక పంజరంలోనే నాలుగు రోజులపాటు ఉంచుకోండి. దాని నుంచి మీ చిలుక కూడా నాలుగు మంచి ముక్కలు నేర్చుకుంటుంది,'' అన్నాడు ముసలిదానితో.

''బాబ్బాబు, అపాటి సహాయం చేతురూ!'' అన్నది ముసలావిడ ఆశగా.

''దానికేం భాగ్యమమ్మా!'' అంటూ శాస్త్రుల్లుగారు తమ చిలుకను ఆవిడ కిచ్చాడు. ఆవిడ దాన్ని తెచ్చి తమ చిలుక వుండే పంజరంలో పెట్టింది. ఈ పని చేశాక ఆవిడకు పెద్ద బరువు దించేసినట్టు అనిపించింది.

కాని అంతలోనే ఇంటి చిలుక కొత్తగా వచ్చిన చిలుకను చూసి కళ్ళారుప్పతూ, ''ఈ ముసలిది పోయినా భాగుండును!'' అన్నది. వెంటనే శాస్త్రుల్లుగారి చిలుక, ''తథాస్తు!'' అన్నది. ముసలావిడకు ఒళ్ళు మండిపోయింది. ఆవిడ పంజరం తెరిచి రెండు చిలుకలనూ వొదిలిపెట్టేస్తూ, ''పోయి చావండి!'' అని తిట్టింది.



# చందమామ అనుబంధం—18

## మన విజ్ఞాన సంపద

## ఎవరాయన?

మధురానగరంలో చాలా కాలం కిందట ఒక అందమైన రాజనర్తకి వుండేది. నగర ప్రముఖులందరూ ఆమె ఆటపాటలకు ముగ్ధులయ్యేవారు.

ఒకనాడు ఆ రాజనర్తకి తన భవనంపైనుంచి—యువ సన్యాసి ఒకడు వీధిలో కొందరితో మాట్లాడుతూ వుండడం గమనించింది. ఆయన రూపంలోని నిండుదనం, మాటలలోని గాంభీర్యం ఆమెను ఎంతగానో ఆకర్షించాయి.

ఆ రాత్రి, ఆ సన్యాసి నర్తకి భవనం ముందు ఒక చెట్టు కింద విశ్రాంతి తీసుకుంటున్నాడు. నర్తకి తన పరిచారికను పంపి, సన్యాసిని తనవద్దకు రమ్మని ఆహ్వానించింది. కాని, ఆయన, ''అందుకు ఇంకా సమయం రాలేదు!'' అని చెప్పిపంపాడు.

కొంతకాలం గడిచింది. ఆ నర్తకిపై దొంగతనం నేరం మోపి, ఆమె చేతులు రెండూ ఖండించి నగరంనుంచి బహిష్కరించారు. ఆ రోజు రాత్రి, సన్యాసి నగరం వెలుపల వున్న నర్తకిని వెతుక్కుంటూ వెళ్ళి, ''నీ దగ్గరికి రావడానికి సరైన సమయం ఇదే!'' అని చెప్పి ఆమెకు మనశ్శాంతి కలిగే విధంగా మంచి మాటలతో ఓదార్చాడు. ఆమె ప్రశాంతంగా కళ్ళు మూసింది!

ఈ ఉదంతంలోని యువసన్యాసి ఎవరు? నర్తకి పేరేమిటి?

(36 వ పేజీ చూడండి)

## మీకు తెలుసా?

1. క్రీ. పూ. 4 వ శతాబ్దంలో భారతదేశాన్ని పర్యటించి, తన యాత్రానుభవాలను గ్రంథస్థం చేసిన పాశ్చాత్యు డెవరు?
2. అశోకుడి రాయబారి శ్రీలంకకు వెళ్ళినప్పుడు, ఆ ద్వీపాన్ని పాలించిన రాజు ఎవరు?
3. ఆ రాయబారి ఎవరు? ఎప్పుడు వెళ్ళాడు?
4. ఆ ద్వీపానికి వెళ్ళిన తరవాతి రాయబారి ఎవరు?
5. రెండవ రాయబారి తనతో తీసుకువెళ్ళిన విలువయిన కానుక ఏమిటి? (36 వ పేజీ చూడండి)




## భారతదేశం: నాడు - నేడు

# నలందా విశ్వవిద్యాలయం

పురాతనమైన తక్షశిల, నలందా విశ్వవిద్యాలయాలు మన దేశానికి ప్రపంచ ఖ్యాతిని కలిగించాయి. ఈనాటి బీహార్ రాష్ట్రంలో పాట్నాకు దక్షిణంగా తొంభై కి.మీ. దూరంలో బర్గావో గ్రామ సమీపంలో ప్రాచీన నలందా విశ్వవిద్యాలయ శిథిలాలు ఉన్నాయి.

గౌతమబుద్ధుడు ఇక్కడ కొంతకాలం తన అహింసాసిద్ధాంతాలను బోధించడం వల్ల ఈ స్థలాన్ని ఎంతో పవిత్రంగా భావిస్తారు. మహావీరుడు కూడా ఈ గ్రామ ప్రాంతంలో కొంతకాలం నివసించాడు. అశోకచక్రవర్తి స్మారక స్థూపాలు నిర్మించాడు.

సుప్రసిద్ధ చీనా యాత్రికుడు హుయాన్‌త్సాంగ్, ఈ విశ్వవిద్యాలయాన్ని కీ. పూ. 7 వ శతాబ్దారంభంలో సందర్శించి, అక్కడి విద్యార్థుల జ్ఞానాసక్తిని, క్రమశిక్షణను ఎంతగానో మెచ్చుకున్నాడు. ఈ విశ్వవిద్యాలయానికి సంబంధించిన వివరాలను ఆయన తన గ్రంథంలో పొందుపరిచాడు.

దాదాపు పదివేలమంది విద్యార్థులు విద్యాభ్యాసం సాగించిన-ఈ గొప్ప విశ్వ

విద్యాలయాన్ని ఎవరు, ఎప్పుడు నెలకొల్పారో ఇతమిత్థంగా తెలియదు గాని, ఇది ఐదవ శతాబ్దంలో నెలకొల్పబడి వుండవచ్చని భావిస్తున్నారు. 5వ శతాబ్దంలో ఈ ప్రాంతాన్ని పరిపాలించిన నరసింహగుప్త బాలాదిత్యుడనే గుప్త చక్రవర్తి నలందలో పెద్ద ఆలయం నిర్మించి, అందులో 80 అడుగుల ఎత్తయిన బ్రహ్మాండమైన బుద్ధ విగ్రహాన్ని ప్రతిష్ఠించినట్టు హుయాన్ త్సాంగ్ తెలియజేశాడు. ఆయన నలందను సందర్శించినప్పుడు శీలాభద్రుడనే పండితుడు విశ్వవిద్యాలయ కులపతిగా వ్యవహరించేవాడు.

టిబెట్, చైనా, ఇండొనేషియా ద్వీపాలు ముఖ్యంగా జావా మొదలైన దూరప్రాంతాలనుంచి కూడా విద్యార్థులు, నలందా విశ్వవిద్యాలయంలో విద్యనభ్యసించడానికి వచ్చేవారు.

విశ్వవిద్యాలయంలో ప్రధానభాగం-మూడు భవనాలలో విస్తరించిన గ్రంథాలయం. వాటిలో ఒక భవనం తొమ్మిది అంతస్థులు కలిగి వుండేదట. ఆ కాలంలో ప్రపంచంలోకెల్లా అత్యధిక గ్రంథాలు ఇక్కడే వుండేవని చెప్పుకుంటారు.

ఇంత గొప్ప విశ్వవిద్యాలయం ఎలా నాశనమయి పోయిందో అంతుబట్టడం లేదు. ఏదో అగ్నిప్రమాదానికి లోనై వుంటుందని ఊహిస్తున్నారు.

నలంద ఇవాళ శిథిలాల రూపంలో తన గతాన్ని మౌనంగా గుర్తు చేస్తున్నది. రాజ్‌గిర్ కొండలనానుకునివున్న ఈ శిథిలాల మధ్య పెద్ద స్థూపం గంభీరంగా వెలుగొందుతున్నది.



## సైకిళ్ళే నయం!

సైకిలూ, కారూ వీటిలో ఏదో ఒకదానిని కోరుకోమంటే సాధారణంగా అందరూ కారునే కోరుకుంటారు. అయితే తక్కువ దూరం ప్రయాణాలకు సైకిలే సర్వవిధాలా శ్రేయస్కరమని విజ్ఞులు అభిప్రాయపడుతున్నారు. ఇవాళ ప్రపంచం మొత్తం మీద 80 కోట్ల సైకిళ్ళు ఉన్నాయి. ఇంకా ఎక్కువ కావలసి వుంది. సైకిలుపై వెళ్ళడం శరీరానికి మంచి వ్యాయామం. వాతావరణ కాలుష్యానికి అవకాశం లేదు. పైగా ట్రాఫిక్ బెడద కూడా వుండదు కాబట్టి, తక్కువ దూరమైతే, సైకిలు మీదే త్వరగా చేరుకోవచ్చు కూడా!

# చందమామ కబుర్లు



## ప్రాచుర్యం సంతరించుకుంటూన్న పల్లెటూరి వైద్యం!

మారుమూల గ్రామాలలో ఉపయోగించే ఆకుపసరులూ, వేళ్ళూ మొదలైన వైద్యపద్ధతులు ఇవాళ అంతర్జాతీయ వైద్యపరిశోధనా సంస్థల దృష్టిని ఆకర్షిస్తున్నాయి. దీనికి కారణం ఆధునిక వైద్యవిధానం రోజురోజుకూ మరీ ఖరీదయిపోవడం మాత్రమే కాదు. కొన్ని సందర్భాలలో అత్యద్భుతంగా పనిచేసే అనుభవ వైద్యాన్ని ఇంతకాలం ఉదాసీన పరిచినట్టు వైద్యశాస్త్ర నిపుణులు భావిస్తున్నారు.

# సాహిత్యావలోకనం

1. పురాతన భారతీయ రాజవంశాల జాబితా ఏ పురాణంలో ఉన్నది ?
2. 'సారే జహాఁసె అచ్ఛా' గీత రచయిత ఎవరు ?
3. రామాయణ మహాభారతాలను సులభ శైలిలో రాసిన సుప్రసిద్ధ రాజకీయ నాయకుడెవరు ?
4. ప్రాచీన భారతీయ బీజగణితగ్రంథం పేరేమిటి ? గ్రంథకర్త ఎవరు ?
5. ఆంగ్లభాషలో ఎన్ని పదాలు ఉన్నాయి ?

## సమాధానాలు

**ఎవరాయన ?**

ఉపగుప్తుడు; వాసవదత్త.

**లోకజ్ఞానం**

1. గ్రీకుదేశస్థుడయిన మెగస్తనీస్.
2. దేవానాంప్రియ తిస్స.
3. అశోకుడి కుమారుడు మహేంద్రుడు; క్రీ. పూ. 250 వ సంవత్సరంలో.
4. అశోకచక్రవర్తి కుమార్తె సంఘమిత్ర.
5. బోధివృక్షం నుంచి ఒక అంటుమొక్క.

**సాహిత్యం**

1. మత్స్యపురాణం.
2. మహమ్మద్ ఇక్బాల్.
3. సి. రాజగోపాలాచారి.
4. లీలావతి గణితం; భాస్కరాచార్య.
5. దాదాపు 3,00,000.



# మూడు పరీక్షలు

[గత సంచిక తరువాయి]

ఆ రాత్రల్లా ప్రయాణించిన కృష్ణవర్మ, మర్నాటి మిట్టమధ్యాహ్నానికి, కౌముదీ దేశపు తూర్పు అడవులను చేరుకున్నాడు. ఆ అడవిలో ఒకచోట అతడికి బాగా ఎత్తుగా పెరిగిన గంధపుచెట్టూ, దానికింద జంటసర్పాలు మెలివేసుకుని వున్నట్టుగా వున్న, ఒక రాతిబొమ్మా కనిపించాయి.

కృష్ణవర్మ కొద్దిసేపు ఆ పరిసరాలను నిశితంగా పరిశీలించి, గుర్రాన్ని సమీపంలోనే నిలబెట్టి, ఒరలో నుంచి కత్తి దూసి, రాతిబొమ్మను సమీపించబోయాడు.

ఇంతలో హఠాత్తుగా వెనుక నుంచి, "ఆగండి!" అన్న హెచ్చరిక వినిపించింది.

కృష్ణవర్మ వెనుదిరిగి చూశాడు. దాపులనున్న ఒక పొద చాటునుంచి, నూగుమీసాలతో వున్న యువకుడొకడు, కృష్ణవర్మను సమీపించి నమస్కరించాడు.

కృష్ణవర్మ ఆశ్చర్యపోతూ, "ఎవరు నువ్వు?" అని ప్రశ్నించాడు.

ఆ యువకుడు తల వంచుకుని, "మీరిక్కడికి రావడానికి కారణమైన వ్యక్తిని!" అని సమాధానమిచ్చాడు.

ఆ సమాధానమూ, అతడి స్వరంలోని కోమలత్వమూ గమనించిన కృష్ణవర్మ, "రాకుమారీ!" అన్నాడు.

అవునన్నట్టు తల ఊపిన జ్యోత్స్న మృదువుగా, "కృష్ణవర్మా! పెట్టె మీది బొమ్మల ఆధారంతో, ఈ ప్రదేశానికి రావడంతోనే, మీరు మూడవ పరీక్షలో కూడా నెగ్గారు. ఇక పదండి," అన్నది.

కృష్ణవర్మ గంభీరంగా, "జ్యోత్స్నా! ఆ పెట్టెమీది బొమ్మలకూ, ఈ ప్రదేశానికీ వెనక ఏదో నిగూఢ రహస్యం వున్నదని, నా అభిప్రాయం! ఏమంటావు?" అని ప్రశ్నించాడు.

లక్ష్మిగాయత్రి



ఆ ప్రశ్నకు ఏమని జవాబివ్వాలా అని, జ్యోత్స్న సందేహిస్తున్నంతలో, కృష్ణవర్మ మృదువుగా, "జ్యోత్స్నా, మీ సందేహం నా కర్థమైంది. మీరనుకున్న పని ప్రమాదాలతో కూడినదే కావచ్చు. రాజ్యాన్ని పాలించే రాజుకు పిరికితనం నేర్పి, వెనక్కు మరల్చాలనే ప్రయత్నం, ఏమంత మంచి పని?" అన్నాడు.

ఆ మాటలతో, అతడు ఇక వెను దిరగడని గ్రహించిన జ్యోత్స్న, "సరే! ఇప్పుడు మీకు కొన్ని ముఖ్యమైన విషయాలు చెప్పాలి. రండి, ఇలా కూర్చోండి," అంటూ దాపులనే వున్న ఒక చెట్టుకింద కూర్చున్నది.

ఆమె తన నడుముకు బిగించుకుని వున్న వస్త్రం చాటునుంచి, ఒక తాళ పత్రాన్ని తీస్తూ, "మీరు నా మాటలకు వెనుదిరగరని ఊహించే, దీన్ని తీసుకు వచ్చాను. ఇది తరతరాలుగా, మా వంశంలో వుంటూ వస్తున్న ఒక గ్రంథంలోనిది. ముందు నేను కొన్ని విషయాలు చెబుతాను, వినండి," అంటూ ఇలా చెప్పసాగింది:

"కొన్ని వందల సంవత్సరాల క్రితం, ఈ ప్రాంతాలను పాలించిన, మా పూర్వీకుడైన హైహయవర్మ మహా శూరుడూ, రాజనీతివేత్తే గాక, మంత్ర శాస్త్రంలో కూడా అమితప్రజ్ఞాశాలి. ఆయన ఇక్కడికి దక్షిణాన వున్న ప్రభువులను అనేకమందిని ఓడించి, తనకు సామంతులుగా చేసుకుని, అపూర్వమైన అనేక నిధులను కప్పంగా తీసుకున్నాడు. అయితే, దురదృష్టవశాత్తూ అతడి ఏకైక పుత్రుడైన అజేయవర్మ పరమమూర్ఖుడూ, తెలివిహీనుడూనూ. అందువల్ల తాను సంపాయించిన ధనలక్ష్మి, రాజ్యలక్ష్మి తన కొడుకు కాలంలో చేజారిపోతాయని భయపడ్డ హైహయవర్మ, నిధులన్నిటితోబాటు, తన మంత్రఖడ్గాన్ని కూడా ఒకచోట దాచిపెట్టి, వాటికి తనకు మంత్రవిద్య నేర్పిన గురువు సహాయంతో మంత్రబద్ధమైన కాపలా పెట్టాడు.



అయితే, ఆ కాపలా ఏమిటో, ఆ నిధులను తీసుకునే విధానమేమిటో మాత్రం ఎవ్వరికీ తెలియజేయలేదు. ఆయన తన చరిత్రను మాత్రం రాసి, "ఆ నిధులు కౌముదీదేశానికి తూర్పు దిక్కున వున్నాయి. జంట సర్పాల రాతివిగ్రహం, వాటి ఉనికికి గుర్తు. ఆ నిధులనూ, నా ఖడ్గాన్నీ వెదికి తీసుకోవడానికి గానీ, నేను సృష్టించిన చిక్కులు విప్పడానికి గానీ మంత్రశాస్త్ర ప్రావీణ్యత అవసరం లేదు. కేవలం మేధస్సు చాలు! వీరుడూ, మేధావీ, ధర్మబద్ధుడూ అయిన ఏ వ్యక్తికైనా అవి లభిస్తాయి, అని, ఇదిగో ఈ తాళపత్రం మీద రాసి, దీన్ని రాజు తప్ప మరెవరూ చదవని, మా వంశచరిత్రలో భద్రపరిచాడు," అంటూ ఆ తాళపత్రాన్ని కృష్ణవర్మకు అందించబోయింది.

కృష్ణవర్మ తాళపత్రాన్ని తీసుకోకుండా, "తర్వాతఏంజరిగిందోచెప్పండి," అన్నాడు.

జ్యోత్స్న అతడివైపు మెచ్చుకోలుగా చూసి, తిరిగి ఇలా చెప్పసాగింది:

"మా పూర్వీకుడు హైహయవర్మ భయపడినట్టే, అజేయవర్మా, తర్వాత అతడి సంతానం పరిపాలిస్తున్న కాలంలో, సామంతరాజ్యాలన్నీ తిరుగుబాటు చేసి, తిరిగి స్వతంత్ర రాజ్యాలయాయి. ఆ రాజుల్లో కొందరు కౌముదీదేశంలోని చాలా భాగాలను కూడా ఆక్రమించుకున్నారు. అయితే, హైహయవర్మ, తాను దాచిన నిధులను గురించి అత్యంతరహస్యంగా వుంచడంతో, వాటిజాడ ఆ రాజుల్లో ఎవరికీ తెలియలేదు. మా వంశస్థులే ఇద్దరు, ముగ్గురు ప్రయత్నించారు కాని, సాధించలేకపోయారు. వాళ్ళు ఈ సర్పప్రతిమను కదిలించి అడుగున సొరంగం గాని, భూగృహం గాని వున్నదేమోనని చూత ప్రయత్నించారట. కాని, ఈ ప్రతిమను అంగుళం కూడా కదిలించలేకపోయారు.

నా తండ్రికి పురుష సంతతి లేని కారణంగా, మా వంశచరిత్ర చదివే అవకాశం నాకు లభించింది. అందులో



ఇదంతా చదివి ఇక్కడికి వచ్చి వెతకగా, ఈ సర్పప్రతిమ కనిపించింది. కాని, దీనిని మాత్రమే ఆధారం చేసుకుని నిధుల్ని సాధించే మార్గం నాకు తెలియలేదు.

మీ శక్తిసామర్థ్యాలూ, ఆలోచనా పటిమల గురించి వింటున్నప్పటినుంచీ, నాకు మీరీకార్యాన్ని సాధించగలరన్న నమ్మకం కలిగింది. నిధులకంటే ముఖ్యంగా, ఆ మంత్ర ఖడ్గం ఏదో మీకు లభిస్తే, బావుంటుందనిపించింది. అందుకే, నా వివాహం ఒక రాజకీయ సమస్యగా మారినప్పుడు, ఈ సమస్యను మూడవ పరీక్షగా మార్చి, పెళ్ళిమీద ఇమిడ్చాను. మీరు ఒంటరిగా గుర్రం ఎక్కి బయలుదేరారని నా వేగులు చెప్పగానే, మీకు రహస్యం అవగతమైందని గ్రహించాను. మీరు ఎటువంటి ఆపదలలో చిక్కుకుంటారో అని మిమ్మల్ని వెన్నంటి వచ్చాను. మంత్రబద్ధమైన ఈ సమస్యలో ముందు, ముందు ఎటువంటి ప్రమాదాలుంటాయో! మిమ్మల్ని ఇందుకు పురిగొల్పడం దుస్సాహసమవుతుందేమోనన్న భయం, ఈ చివరి క్షణంలో నన్ను పీడిస్తున్నది," అని ముగించింది.

జ్యోత్స్న మాటలకు కృష్ణవర్మ నవ్వి, "నిధులను మంత్రాల సహాయంతో దాచినప్పటికీ, వాటి గురించి వెదికే వ్యక్తికి మంత్రశాస్త్ర ప్రావీణ్యత అవసరంలేదని హైహయవర్మ చెప్పిన విషయం, మీరు మరిచిపోతున్నారు. అంటే—సమస్య మంత్రబద్ధమైనదైనా, ఇందులో హానికి ఎక్కువ అవకాశంలేదు. మన తెలివినిబట్టి విజయమో, అపజయమో కలుగుతుంది. అంతే! ప్రయత్నించి చూద్దాం, రండి." అంటూ జంట సర్పాల ప్రతిమ దగ్గిరకు వెళ్ళి, దాన్ని అంగుళం కూడా వదలకుండా నిశితంగా పరీక్షించసాగాడు.

అలా కొంతసేపు గడిచాక కృష్ణవర్మ హఠాత్తుగా, "జ్యోత్స్నా! ఇటు చూడండి," అని జంట సర్పాల ప్రతిమకు పైభాగాన, రెండు పడగలకూ మధ్యన చూపించాడు.

ఆ ప్రదేశంలో ఒక రెండంగుళాల మేరకు వృత్తాకారంలో, కాస్త ఉబ్బెత్తుగా వున్నది.

"అవును, ఇదేదో విశేషంలాగే వున్నది," అంటూ జ్యోత్స్న ఆశ్చర్యపోయింది.

''బహుశా ఇదే కీలకస్థానం కావచ్చు. చూద్దాం!'' అని కృష్ణవర్మ, జ్యోత్స్నను దూరంగా వెళ్ళమనిచెప్పి, విల్లూ బాణమూ తీసుకుని, సరిగ్గా ఆ వృత్తాకారపు మధ్య భాగానికి గురి చూసి బాణాన్ని వదిలాడు. బాణం ఆ వృత్తాన్ని మధ్యలో తాకింది.

ఆ మరుక్షణం, అక్కడ కళ్ళు మిరుమిట్లు కొలిపేంత మెరుపుమెరిసి, పెద్ద ధ్వని అయింది. మరుక్షణమే జంట సర్పాల ప్రతిమ మాయమై, భూమి దిగువున మెట్లు కనిపించాయి.

తమ మొదటి ప్రయత్నం నెరవేరినందుకు ఆనందిస్తూ, ముందు కృష్ణవర్మ, అతడి వెనుకగా జ్యోత్స్న నెమ్మదిగా మెట్లు దిగసాగారు. కొన్ని మెట్లు దిగిన తర్వాత, వాళ్ళకు ఒక సన్నని దారి కనిపించింది. ఆదారి వెంట నడిచి, చివరకు వాళ్ళిద్దరూ ఒక విశాలమైన మైదానాన్ని చేరుకున్నారు.

ఆ మైదానంమధ్యలో ఒక సరస్సున్నది. అందులో ఎక్కడచూసినా బంగారు రంగులో మెరిసిపోతున్న పద్మాలున్నవి.



వాటిమధ్య ఒకేఒక తెల్లని పద్మం వున్నది. సరస్సుకు కుడివైపున ఒక పెద్ద చెట్టున్నది. ఆ చెట్టు చుట్టూ రాతితిన్నె, దానిమీద మూతలు పెట్టబడిన రెండు బంగారు పాత్రలూ వున్నవి.

ఇవన్నీ చూసి జ్యోత్స్న, ''మళ్ళీ ఇక్కడా ఏదో నిగూఢ రహస్యం వున్నట్టున్నది!'' అన్నది.

"అవును! అపూర్వమైనవెప్పుడూ సులభసాధ్యాలు కావు,'' అని ఒక క్షణం ఆగి, ''బహుశా, బంగారు పద్మాలు రత్నరాసులయి వుంటవి. ఆ ఒక్క తెల్లని పద్మం మంత్ర మహిమగల ఖడ్గమై వుంటుంది. వాటిని చేరుకునే మార్గం, హైహయవర్మ,



ఈ బంగారు పాత్రల్లో ఇమిడ్చి వుంటాడు,'' అంటూ చెట్టుదగ్గిరకు వెళ్ళి, రెండుపాత్రలమీదిమూతలూతీసిచూశాడు.

ఒక పాత్రలో సువాసనలు వెదజల్లే తినుబండారాలున్నవి. రెండోవదానిలో కొద్దిపాటి బియ్యం మాత్రం వున్నది.

కృష్ణవర్మ వాటిని చూసి, కొంతసేపు ఏదో ఆలోచించి, చెట్టు వెనుకభాగానికి వెళ్ళి చూశాడు. అక్కడ ఒక పొయ్యీ, అందులో రెండు కట్టెలూ, పక్కనే రెండు పాత్రలూ వున్నవి.

కృష్ణవర్మ వాటిని చూసి జ్యోత్స్న వైపు తిరిగి, ''ఇది నిధి కోసం వచ్చే వారి ఆలోచనాపటిమకు పరీక్ష! ఎవరూ ముక్కూ మొహం తెలియనిచోట, వండి సిద్ధంగా వున్న ఆహారాన్ని ముట్టుకోరాదు,'' అంటూ బియ్యం వున్న పాత్రను చేతిలోకి తీసుకుని సరస్సుకేసి బయలుదేరాడు.

అతడి అభిప్రాయం గ్రహించిన జ్యోత్స్న, ''ఆ పాత్రలోని బియ్యం నేను కడిగి తెస్తాను. ఇవ్వండి!'' అని అతడి చేతిలోని పాత్రను తీసుకోబోయింది.

కృష్ణవర్మ, ఆమెను వారిస్తూ, ''వద్దు. సరస్సులో కూడా ఏదైనా మాయ వుండవచ్చు. నేనే వెళ్తాను. మీరిక్కడే వుండండి,'' అని చెప్పి, మరొక ఖాళీ పాత్రను కూడా తీసుకుని, సరస్సుదగ్గిరకు వెళ్ళి, సరస్సులోని నీటిని రెండవ పాత్రతో తీసి, బియ్యంలో పోసి కడిగాడు.

అతడు ఊహించినట్టే, సరస్సులోని నీరు బియ్యాన్ని తాకగానే, పాత్ర ఒక్కసారిగా వేడెక్కి, నీరు మరుగుతూ ఆవిర్లు రాసాగాయి. ఆ వేడిని కొద్దిసేపు ఎలాగో భరించిన కృష్ణవర్మ, ఇక భరించలేక, పాత్రను సరస్సులోకి జారవిడిచాడు.

పాత్ర సరస్సులోపడ్డ మరుక్షణం సరస్సు మాయమై, అక్కడ నవరత్నాల రాసులు కనిపించాయి. జ్యోత్స్న, కృష్ణవర్మ ఆశ్చర్యానందాలతో, ఆ నిధులను చూడసాగారు. అయితే, అంతలోనే వారికి హఠాత్తుగా నిధులు తప్ప, మంత్రఖడ్గం

కనిపించలేదన్న విషయం జ్ఞప్తికి వచ్చింది. వాళ్ళు నిధులను చూసిన ఆనందం మరిచి, ఖడ్గం కోసం వెదకసాగారు.

వాళ్లు ఎక్కువసేపు శ్రమపడకుండానే, నవరత్నపు రాసులమధ్య నిర్మలంగా మెరుస్తున్న తెల్లని పద్మం కనిపించింది.

"మీరు చేసిన ప్రయత్నానికి, స్వర్ణ పద్మాలు మాత్రం, నవరత్నాలుగా మారాయన్న మాట! మరి ఈ తెల్లపద్మం ఖడ్గంగా మారాలంటే ఏం చేయాలో?" అన్నది జ్యోత్స్న.

కృష్ణవర్మ ఆమెకేమీ జవాబివ్వకుండా, వంగి తెల్ల పద్మాన్ని మొదలు పట్టుకుని బలంగా లాగాడు. మరుక్షణం పద్మం మాయమై, ఆ స్థానంలో ఒక రాక్షసుడు ప్రత్యక్షమయ్యాడు.

ఖడ్గానికి బదులు రాక్షసుడు కనిపించినందుకు జ్యోత్స్న, కృష్ణవర్మలిద్దరూ నిర్ఘాంతపోయి చూస్తూండగా, రాక్షసుడు నవ్వి, "నిధులను సాధించిన రాజకుమారుడు, వాటిని తీసుకుని వెళ్ళిపోక, నన్నెందుకు పిలిచినట్టు?" అన్నాడు.

అతడి ప్రశ్న వినగానే కృష్ణవర్మ గంభీరంగా, "నిజమే! కేవలం ధనాశ గల రాజకుమారుడంటే, రాక్షసులకు కూడా చులకనే. కాని, నేను అటువంటి వాణ్ణి కాదు. నేను ముఖ్యంగా వచ్చింది



అపూర్వమైన ఖడ్గాన్ని సాధించడానికేగాని, నిధులకోసంకాదు," అన్నాడు.

రాక్షసుడు ఆ మాటలకు వికటంగా నవ్వి, "ఆహాఁ, గొప్ప పౌరుష ప్రదర్శన! కాని, ఆ ఖడ్గం రాజధర్మం తెలిసిన ఉత్తముడికి తప్ప, ఇతరులకు లభించదు. అయినా కేవలం యుద్ధాలకు పనికివచ్చే కత్తి కోసం ఇంత పాకులాటదేనికి? ధనంతో సాధించలేనిది లేదు. హాయిగా నిధులను తీసుకునివెళ్ళు!" అన్నాడు.

ఇందుకు కృష్ణవర్మ చిన్నగా నవ్వి, "నీ ప్రశ్నకు నేనిచ్చే జవాబులోనే రాజధర్మం ఇమిడివున్నది. అభివృద్ధి సాధించగలిగేది ధనంతో కాదు; కృషితో. మనిషికి

కావలసిన ఆహారాన్నీ, మనిషి సౌఖ్యవంతమైన జీవితాన్ని సాగించడానికి అవసరమైన సమస్తాన్నీ, ప్రకృతిసిద్ధంగా భగవంతుడు సృష్టించే ఇచ్చాడు. ప్రకృతిలో ఆహారం లేని నాడు, ఈ నిధులు మనిషి కడుపు నింపవు. అందుచేత ఆ ప్రకృతి వనరులు సక్రమంగా అందరికీ లభించేటట్టు చూడడం, బలవంతులు, బలహీనుల్ని అణగదొక్కకుండా కాపాడడం—ఇదే రాజధర్మం! తన ప్రజలను దుష్టశక్తులనుంచి కాపాడడానికి, రాజు ఎక్కువగా ఉపయోగించేది దండోపాయం. అందుచేత రాజుకు తన విధినిర్వహణలో ఎక్కువగా కావలసింది ఖడ్గమే!'' అన్నాడు.

కృష్ణవర్మ మాటలు వింటూనే రాక్షసుడు, అతడికి వంగి నమస్కరించి, ''మహానుభావా! నీవంటి ఉత్తముడి కోసమే ఇన్నాళ్ళుగా చూస్తున్నాను. ఇదిగో, మంత్రపూరితమైన చంద్రహాసం!'' అంటూ గాలిలో చెయ్యిచాపి, చంద్రహాస ఖడ్గాన్ని తీసియిస్తూ, ''ఈ ఖడ్గాన్ని చేత ధరించిన వ్యక్తికి విజయమే కాని, అపజయం వుండదు. ఈ ఖడ్గాన్నీ, ఆ నిధులనూ స్వీకరించి ప్రజారంజకంగా పాలన చెయ్యి.'' అని చెప్పి, కృష్ణవర్మకు మరొకసారి నమస్కరించి, మాయమైపోయాడు.

కృష్ణవర్మ ఖడ్గాన్ని కళ్ళకద్దుకుని, జ్యోత్స్నకు అందిస్తూ, ''జ్యోత్స్నా, ఇప్పటికి మీరు పెట్టిన మూడవ పరీక్ష ముగిసింది. ఇదిగో, మీ పూర్వీకుల ఖడ్గం!'' అన్నాడు.

జ్యోత్స్న ఖడ్గాన్ని తీసుకోకుండా, చిరునవ్వుతో, ''పరీక్షలో గెలుచుకున్న వస్తు వేదయినా, ఆ గెలుచుకున్నవారిదే అవుతుంది. ఇతరులకు చెందదు,'' అన్నది.

ఆ తర్వాత ఇద్దరూ వచ్చిన దారినే తిరిగి వెళ్ళి, రాజప్రాసాదం చేరారు. రాజు చంద్రకాంతుడు, జరిగినదంతా విని, పరమానంద భరితుడయ్యాడు. ఆ తర్వాత కొద్ది రోజుల్లోనే జ్యోత్స్నా, కృష్ణవర్మలకు వివాహం జరిగింది.





# శ్రీ జగన్నాథ చరిత్ర

ఆ రోజు రాత్రి లలిత, గుహలోని దేవుణ్ణి చూడాలన్న తన భర్త కోరికను తండ్రికి తెలియజేసింది.

విశ్వావసు కోపంగా ఆమెకేసి చూశాడు. కాని, ఏమీ మాట్లాడలేదు.

కొంతసేపు మౌనం వహించి, లలిత, "నాన్నా, నేను మీకు ఏకైక సంతానం కదా ? మీ అనంతరం మీరు ఆరాధిస్తూన్న దేవుణ్ణి ఎవరు పూజించ గలరు ? ఆ బాధ్యత మీ అల్లుడయిన విద్యాపతికి ఉన్నదికదా ? అలాంటప్పుడు, ఆ దేవుణ్ణి ఆయనకు చూపడంలో తప్పేమిటి ?" అని అడిగింది.

"నీ భర్త విద్యాపతి, ఈ అడవిలో మనతో శాశ్వతంగా వుండి పోగలడంటావా తల్లీ ?" అని అడిగాడు, విశ్వావసు నెమ్మదిగా.

"మీరు ఆయన్ను మీ కుమారుడిలా అనురాగంతో చూసుకుంటే, ఉండక ఎక్కడికి పోతాడు ?" అని సమాధానమిచ్చింది లలిత.

"విద్యాపతి మనకు భిన్నమైన వాతావరణానికీ, ఆచార సంప్రదాయాలకూ, సంస్కృతికీ అలవాటు పడినవాడు. అయినా, నీ కోసం అతని కోరిక తీరుస్తాను," అంటూ విశ్వావసు ఆప్యాయంగా కుమార్తె తల నిమిరాడు.

తాను, దేవుణ్ణి పూజించే బాధ్యతను వేరొకరికి అప్పగించేప్పుడు మాత్రమే, ఆ గుహకు వెళ్ళే మార్గాన్ని చూపాలన్న

2. శిలాప్రతిమ అపహరణ

నియమాన్ని మాత్రం అతిక్రమించ లేనన్నాడు, విశ్వావసు.

అందువల్ల, కళ్ళకు గుడ్డ కట్టుకుని అయన వెంట వెళ్ళడానికి విద్యాపతి అంగీకరించాడు!

మరునాడు యథాప్రకారం సూర్యోదయానికి ఒక గంట ముందే, విశ్వావసు నిద్రలేచి సిద్ధమై, విద్యాపతి కళ్ళకు నల్లగుడ్డను కట్టి, అతని కుడిచేయి పట్టుకుని నడిపిస్తూ, తిన్నగా గుహకు బయలు దేరాడు.

అయితే, విద్యాపతి ఎవరికీ తెలియకుండా, ఎడమ చేతిలో గుప్పెడు ఆవాలు తీసుకుని, దారి పొడవునా జారవిడుస్తూ, విశ్వావసు వెంటనడిచాడు.

"నాయనా, మనం గుహను సమీపించాము. తలను కొంచెం కిందికి దించు; గుహలో ప్రవేశించాలి," అంటూ విశ్వావసు అతని కళ్ళకు కట్టిన గుడ్డను మెల్లగా విప్పాడు.

విద్యాపతి నిదానంగా కళ్ళు తెరిచాడు. గాఢాంధకారం అలముకొని ఉన్నది. క్రమంగా అతని దృష్టి గుహ లోపల వున్న ఒక పెద్ద రాతిపీఠం మీద పడింది. విశ్వావసు ఆ పీఠంమీద కొన్ని పువ్వులు ఉంచాడు.

హఠాత్తుగా అక్కడ మెరుపులా నీలవర్ణ ప్రకాశం మెరిసింది. ఒక్క క్షణంలో విద్యాపతికి వేణువును ఊదుతూ వున్న శ్రీకృష్ణ రూప దర్శనం అయింది. ఆనందా



శ్చర్యాలతో "ఆహ్ఁ" అని అరిచాడు విద్యాపతి!

"ఏమయింది నాయనా?" అని విశ్వావసు విద్యాపతి వెన్ను చరిచాడు.

ఆ మాటలతో స్పృహలోకి వచ్చాడు విద్యాపతి.

అతడు మౌనంగా తల వంచుకున్నాడు. తాను ఆశ్చర్యంతో కేకపెట్టిన కారణంచెప్పడానికి విద్యాపతి సుముఖంగా లేడని విశ్వావసు పసిగట్టాడు. అందువల్ల ఆ విషయం గురించి మళ్ళీ ఆయన అడగలేదు. అతణ్ణి గుహ దగ్గరికి తీసుకు వచ్చిన విధంగానే, మళ్ళీ కళ్ళకు గుడ్డ కట్టి, నడిపించుకుంటూ, గూడెం కేసి బయలుదేరాడు.

వారి రాకకోసం ఎదురు చూస్తున్న లలిత, "గుహలోపల ఏం చూశారేమిటి?" అని అడిగింది భర్తను ఎంతో ఉత్సాహంగా.

"చీకటి గుహలోపల ఏం అద్భుతం వుంటుంది. చెప్పుకోతగిందేమీ అక్కడ కనిపించలేదు." అన్నాడు విద్యాపతి గంభీరంగా.

తాను గుహలోపల చూసిన అద్భుత దృశ్యాన్ని, భార్య లలితకు చెప్పడానికి కూడా విద్యాపతి సంశయించాడు. అయితే, ఈ రహస్యాన్ని తనలో దాచుకోవడానికి అతడు ఎంతో శ్రమపడ్డాడు. ఇలాంటి సంకటపరిస్థితి అతనికి ఇంతకు ముందెన్నడూ ఏర్పడలేదు.





ఇంద్రద్యుమ్న మహారాజు దైవప్రేరణతో, భావితరాల క్షేమం కోసం ఒక మహాకార్యాన్ని నెరవేర్చడానికి దీక్షబూని, ఎంతో నమ్మకంతో ఒక గొప్పకార్యాన్ని తనకు అప్పగించాడు. రాజు ఆనతి ప్రకారం, దైవకార్యం నిర్వర్తించడానికి వచ్చి, తను మార్గమధ్యంలో లలితను చూసి పెళ్ళాడాడు. అందువల్ల, లలితకు రహస్యం తెలియజేయడం కన్నా, తను వచ్చిన కార్యం పూర్తి చేయడమే ప్రధాన కర్తవ్యంగా భావించాడు విద్యాపతి.

అయితే, రహస్యాన్ని లలిత నుంచి దాచినంత మాత్రాన సమస్య పరిష్కారం కాదు. విశ్వావసు పూజిస్తున్నది శ్రీ కృష్ణరూపమని అతడు గ్రహించాడు. తను వచ్చిన పని సఫలం కావాలంటే, విశ్వావసు పూజిస్తూన్న శిలారూపాన్ని తీసుకుని రాజధానీ నగరం చేరుకోవాలి! అలా చేయడం, తనను ఆదరించి అప్యాయత చూపేవారి నమ్మకాన్ని వమ్ముచేయడమే అవుతుంది. నమ్మకద్రోహానికి పాల్పడడం ధర్మమా?

అయినా, విశ్వావసు తనను ఎక్కడ నమ్మాడు? అసలు నమ్మి ఉన్నట్టయితే, కళ్ళకు గుడ్డకట్టి తనను తీసుకుపోతాడా? అందువల్ల గుహనుంచి దైవరూపాన్ని తీసుకువెళ్ళడం నమ్మకద్రోహం అవుతుందా?

ఇలా విద్యాపతి రకరకాలుగా ఆలోచించసాగాడు. ఇలాంటి ఆలోచనలతో పగలంతా పరధ్యానంగా గడిపేవాడు. రాత్రులలో కంటిమీదికి కునుకు వచ్చేది కాదు. అయినా ఏ సమస్యకుగాని, కేవలం వాదోపవాదాలే పరిష్కారాలు కావుకదా!

విద్యాపతిలో వచ్చిన మార్పును గమనించిన లలిత దిగులు చెందింది. తనను పెళ్ళాడినందుకు పశ్చాత్తాపపడుతున్నాడా? నగరంలోని ఆడంబరాలు దూరమయ్యాయని విచారపడుతున్నాడా? అసలు విషయం తెలుసుకోవాలని, ఆమె ఒకనాడు విద్యాపతిని అడిగింది.



"నగరంలోని ఆడంబరాలు లేవని బాధపడటం లేదు. అయినా, రాజధానిలోని నా తల్లిదండ్రులను వదిలివచ్చి చాలా కాలమయింది. నేనేమయ్యానో అని వాళ్ళు బెంగపెట్టుకుని వుంటారు. త్వరగా వెళ్ళి, వృద్ధులయిన నా తల్లిదండ్రుల క్షేమం చూడవలసింది కన్నబిడ్డగా నా ధర్మం కాదా? అయినా, నిన్ను ఇక్కడే వదిలి వెళ్ళడానికి మనసొప్పడం లేదు. కానీ, నిన్ను నా వెంట తీసుకువెళ్ళానంటే అక్కడ వున్న వాళ్ళందరూ నిన్ను వింతగా చూస్తారేమో, అని అనుమానంగా ఉన్నది. పైగా నీ మీద పంచప్రాణాలు పెట్టుకున్న నీ తండ్రి నిన్ను వదిలి వుండగలడా?" అన్నాడు విద్యాపతి.

"ఇప్పటిలాగానే మీరు నన్ను ఆప్యాయంగా చూసుకుంటున్నంతకాలం ఎవరేమనుకున్నా నాకు బాధ లేదు," అని, లలిత కొంతసేపు మౌనం వహించి ఆ తరవాత, "అయినా, నేను మీ వెంటవస్తే మా తండ్రినెవరు చూసుకుంటారు? అదే విచారంగా వుంది!" అన్నది కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ.

"అవును. ఎన్నటికీ మీ తండ్రిని వదిలి రాకూడదు. అందుకే, నువ్వు అనుమతించావంటే, నేను వెళ్ళి మా తల్లిదండ్రులను చూసి, త్వరలో ఇక్కడికి తిరిగి వస్తాను," అన్నాడు విద్యాపతి చిన్నగా నవ్వుతూ.

"నిజంగా మీరు తిరిగి రాగలరా?" అని అడిగింది లలిత దిగులుగా.

"నేను నిన్ను వదిలి వుండగలనా?" అన్నాడు విద్యాపతి.

"అలా అయితే, నిశ్చింతగా వెళ్ళి రండి. మా అత్తమామల ఆశీస్సులు పొందే సుదినం కోసం నేను ఎదురు చూస్తున్నట్టు వారికి తెలియజేయండి," అన్నది లలిత.

లలిత భర్త కోరికను తండ్రికి తెలియజేసింది. విశ్వావసు కూడా అందుకు

సమ్మతించి, విద్యాపతి కోసం అనేక కానుకలు సిద్ధం చేయసాగాడు. కాని విద్యాపతి అడ్డుపడి, ''కానుకలు తీసుకు పోవడానికి ఇది సమయం కాదు. లలితను రాజధానికి వెంటబెట్టుకుని వెళ్ళేప్పుడు కానుకలతో వెళ్ళడం ఉచితంగా వుంటుంది. మొదట, మా వివాహం గురించి, మా తల్లిదండ్రులకు తెలియచేయాలి కదా?'' అన్నాడు విద్యాపతి.

అతని మాటలు విశ్వావసుకు సబబుగా తోచాయి. ఆయన అల్లుడి ప్రయాణానికి ఒక బలమైన గుర్రాన్ని ఏర్పాటు చేశాడు.

విశ్వావసు లలితల వద్ద సెలవు తీసుకుని, విద్యాపతి గుర్రం మీద రాజధానికి బయలుదేరాడు.

లలిత విద్యాపతికి కన్నీళ్ళతో వీడుకోలు పలికింది!

కొన్నాళ్ళక్రితం, విద్యాపతి రహస్యంగా జారవిడుస్తూ వెళ్ళిన ఆవగింజలు మొలకలెత్తి, స్పష్టంగా కనిపిస్తున్నవి. వాటిని అనుసరిస్తూ కొంతదూరం వెళ్ళాక అతడొక గుహను సమీపించాడు.

గుహ ముఖద్వారం వెలుపలికి కనిపించకుండా పెద్ద పెద్ద బండలు అడ్డదిడ్డంగా అమర్చబడి వున్నాయి.

విద్యాపతి గుర్రంపైనుంచి కిందికి దిగి, జాగ్రత్తగా గుహలోపలికి ప్రవేశించాడు. అక్కడ అతడు మరొకసారి అద్భుతమైన అనుభూతికి లోనయ్యాడు. ''దేవా, నీ మీద భారం వేసి, ఉత్తమమని తోచిన నా కర్తవ్యాన్ని నిర్వహిస్తున్నాను. అపరాధమయితే క్షమించి, రక్షించు,'' అని మనసులో ప్రార్థిస్తూ, విశ్వావసు పువ్వులు ఉంచిన రాతిపీఠం మీది చిన్న శిలాప్రతిమను తీసుకుని కళ్ళకద్దుకుని సంచిలో వేసుకుని, విద్యాపతి వెలుపలికి వచ్చి, గుర్రమెక్కి, ఎటు పోవాలో మార్గం తెలియకపోయినప్పటికీ, ఆ భగవంతుడే దారి చూపగలడన్న దృఢ విశ్వాసంతో, గుర్రాన్ని ముందుకు అదిలించాడు. —(ముగింపు వచ్చే సంచికలో)



# సమయస్ఫూర్తి

విజయపురి ఆస్థానంలో వుండే శ్రీదత్తుడు, గొప్ప ఐంద్రజాలికుడే గాక, మంచి సమయస్ఫూర్తి గలవాడు. ఒకసారి శ్రీదత్తుడు, రాజుగారు ఏర్పాటు చేసిన వస్తుప్రదర్శనకు, తనతోబాటు తన మిత్రుడు విష్ణువర్మను తీసుకు వెళ్ళాడు. రాజుగారి అంతఃపురంలోని విలువైన ఆభరణాలను ప్రజలు చూసి ఆనందించేందుకు, ఆ ప్రదర్శన ఏర్పాటు చేయబడింది.

రాజుగారి సిబ్బంది ఏమరుపాటుగా వున్నప్పుడు, ప్రదర్శనలోని వజ్రాలహారాన్ని తన మిత్రుడు విష్ణువర్మ జేబులో వేసుకోవడం, శ్రీదత్తుడు చూశాడు. తనను పోషిస్తున్న రాజుగారి సొమ్ము దొంగిలించబడుతూంటే చూసి ఊరుకోవడం, రాజద్రోహమవుతుంది. దొంగతనం బయటపెడితే, తన మిత్రుడు చెరసాలకు వెళ్ళడం ఖాయం!

ఏమి చేయడమా అని శ్రీదత్తుడు కొంచెంసేపు ఆలోచించి, వస్తుప్రదర్శన చూస్తున్న వాళ్ళతో, "ప్రజలారా! విలువైన ఆభరణాలను తదేకంగా చూస్తూ విసుగెత్తిన మీకు, చిన్న వినోదం కలిగిస్తాను. ఈ ఆభరణాలలో ఒకదాన్ని మాయం చేసి, దాన్ని నా మిత్రుడి జేబులోంచి తీస్తాను. చూడండి!" అంటూ చేతిని గాలిలో అటూ ఇటూ తిప్పి, మిత్రుడి జేబులోంచి వజ్రాలహారాన్ని బయటకు తీశాడు. ప్రజలు ఆశ్చర్యంతో చప్పట్లు చరిచారు.

ఒకవైపు తన పాడుబుద్ధిని మందలిస్తూనే, మరొకవైపు తన పరువు కాపాడిన శ్రీదత్తుడి సమయస్ఫూర్తిని, విష్ణువర్మ ప్రశంసించాడు. —బి. రఘురామరాజు





# తెలివైన ముసలాడు

గ్రీసుదేశంలో ఒక ముసలాడూ, వాడి భార్యా ఉండేవారు. ఒకనాడు ముసలాడు తన భార్యతో, "ఏమే, డబ్బు అవసరంగా కావాలి. నువు సంతకు పోయి, మన అవును అమ్మిరా. నేనే పోదును గాని నా కాలు బెణికింది," అన్నాడు.

ముసలిది అవును తోలుకుని సంతకు బయలుదేరింది. ఆమె కొంతదూరం వెళ్ళేసరికి ముగ్గురు దొంగలు దూరం నుంచి, ముసలిది అవును అమ్మబోతున్నదని గ్రహించి, దాన్ని చవకగా కొనెయ్యటానికి ఒక ఉపాయం ఆలోచించారు.

ఒక దొంగ ముసలిదాన్ని కలుసుకుని, "మేకను అమ్మటానికి తీసుకుపోతున్నావా? ఎంతకు అమ్ముతావేమిటి?" అని అడిగాడు.

"నీకు కళ్ళు లేవురా? అవు కని పిస్తూంటే మేక అంటావేం?" అని ముసలిది వాణ్ణి కోప్పడింది.

దొంగవాడు విచారంగా తల ఆడించి, "బామ్మా, నువేమన్నా కలగంటున్నావా ఏం? అది మేక. ముప్పై మాడలకు ఆ మేకను నాకు అమ్మెయ్యి," అన్నాడు.

ముసలిది వాణ్ణి తన చేతి కర్రతో ఒక పోటు పొడిచి, ముందుకు సాగింది.

ఆమె కొంతదూరం వెళ్ళేసరికి రెండో దొంగ తారసపడి, "అమ్మమ్మా, ఎక్కడిదాకా ప్రయాణం?" అన్నాడు.

"సంతకు, నాయనా. దీన్ని అమ్మమని ముసలాయన అన్నాడు," అన్నది ముసలిది.

"పాతిక మాడలకు నేనే కొంటాను. నాకు అమ్మెయ్యి," అన్నాడు వాడు.

"నీకు మతిపోయిందిరా? నిక్షేపమంటి అవును మేక ఖరీదుకు అమ్మమంటావా?" అన్నది ముసలిది.

రెండో దొంగవాడు ఆశ్చర్యం నటిస్తూ, "పెద్దదానివయావు. చత్వారం వచ్చే

గ్రీకు జానపద కథ



అవును తీసుకుని!'' అన్నది ముసలిది బాధగా.

''అత్తా, నీకు పైత్యవికారం లాగుంది. ఇరవై మాడలకు నాకు దీన్ని అమ్మి, ఇంటికి పోయి నడుం వాల్చు!'' అన్నాడు మూడో దొంగవాడు జాలిగా.

''ఒకడు ముప్పై మాడలిస్తానంటే ఇంకోడు ఇరవైఅయిదు అన్నాడు. ఇద్దరికీ కాదని నీకు ఇరవైకి ఇయ్యమంటావురా? ముప్పై ఇచ్చి తీసుకో,'' అన్నది ముసలిది.

''న్యాయంగా ఈ మేక ముప్పైమాడలు చెయ్యదత్తా! శ్రమపడిపోతావు. ముప్పై తీసుకో,'' అన్నాడు మూడో దొంగవాడు.

ముసలిది తన ఆవును మేక ఖరీదుకు అమ్మి, ఇంటికి తిరిగి వచ్చి, జరిగినదంతా తన మొగుడికి చెప్పింది. ముసలాడు ఆ దొంగవాళ్ళ వర్ణన వింటూనే, వాళ్ళు పొరుగూరి కుర్రాళ్ళని పోల్చుకుని, ''జరిగినదేదో జరిగిందిలే. జరగవలిసింది నేను చూస్తాను,'' అన్నాడు.

ముసలాడు బయటికి వెళ్ళి, ఒకేరకంగా ఉన్న రెండు కుందేళ్ళను కొనుక్కొచ్చాడు. అందులో ఒక కుందేలును బుట్టలో పెట్టి మూత వేసి, రెండో దాన్ని మరో బుట్టలో పెట్టుకుని బయలుదేరుతూ తన భార్యతో, ''ఏమే, ఇవాళ మనకు అతిథులు వస్తారు. తేనెరొట్టెలూ, పాయసమూ, బాతు

సింది. అందుకే మేకను చూసి ఆవు అనుకుంటున్నావు,'' అన్నాడు.

''అయితే అయిందిలే!'' అంటూ ముసలిది ముందుకు సాగింది. కాని ఆమె మనసు ఆరాటపడుతున్నది. తాను ఆవును తీసుకుని బయలుదేరింది గదా, అందరూ దాన్ని చూసి మేక అని ఎందుకు అంటున్నారు?

అలా ఆలోచిస్తూ ఆమె మరి కొంత దూరం వెళ్ళేసరికి మూడో దొంగవాడు ఎదురుపడి, ''అత్తా, మేకను అమ్మబోతున్నావా ఏం? ఇరవైమాడలకు నేనే కొంటాను,'' అన్నాడు.

''అయితే ఇది మేకే నన్నమాట! ఇదేదో గారడీలాగుంది. నేను బయలుదేరినది

మాంసం వేపుడూ చేసి సిద్ధంగా ఉంచు. నేను ఇంటికి వచ్చి, వంట ఏం చేశావని అడుగుతాను. కుందేలు వచ్చి చెప్పినట్టే చేశానను,'' అని హెచ్చరించాడు.

ముసలివాడు పొరుగు గ్రామం వెళ్ళే సరికి ముగ్గురు దొంగవాళ్ళూ పానశాల బయట కూర్చున్నారు. వాళ్ళు ముసలాణ్ణి చూసి, ''ఏం, ముసలాడా? నీ పెళ్ళానికి ఆవు ఏదో, మేక ఏదో కూడా తెలీదే!'' అని వేళాకోళం ఆరంభించారు.

''ఆఁ, దాని మొహం! దానికి మతి సరిగా లేదు. అయితేనేం? వంట దివ్యంగా చేస్తుంది,'' అన్నాడు ముసలాడు.

"అదీకొంత మేలే!"అన్నాడు ఒక దొంగ.

ముసలాడు ఆలోచన నటిస్తూ, ''ఇవాళ ఏం వంట చెయ్యమందాం? పాయసం తినాలనుంది. బాతు వేపుడు కూడా. పోతే, తేనె రొట్టెలు కూడా తింటాం!'' అని, బుట్టలో నుంచి కుందేలును పైకి తీసి, ''ఒసే, నువు వెంటనే ఇంటికి పోయి, పాయసమూ, బాతు వేపుడూ, తేనె రొట్టెలూ చెయ్యమని అమ్మతో చెప్పు!'' అంటూ వదిలేశాడు. అది చెంగు చెంగున ఎగురుతూ క్షణంలో ఎటో మాయమయింది.

''చిత్రంగా ఉందే!ఆకుందేలు నిజంగా ఇంటికి పోయి నువు చెప్పినదంతా ముసలిదానికి చెబుతుందా?'' అన్నారు దొంగలు.



''ఎందుకు చెప్పదూ? ఇంత ప్పటి నుంచీ దాన్ని పెంచాను. నా మాట నమ్మకపోతే మా యింటికి వచ్చి మీరు కూడా భోజనంచెయ్యండి," అన్నాడు ముసలాడు.

ముగ్గురూ ముసలాడి వెంట వాడి ఇంటికి వచ్చారు. ముసలాడు, ''ఏమే, వంట ఏం చేశావు?'' అని భార్యను అడిగాడు.

''కుందేలు చెప్పినదే చేశాను,'' అన్నది ముసలిది. ఆమె నలుగురికీ వడ్డించింది. ముసలాడు కుందేలుకు చెప్పిన ప్రకారమే వంట సిద్ధం కావటం చూసి దొంగలు మోసపోయి. తమలో తాము గుసగుసలాడుకుని, ఆకుందేలును అమ్మమన్నారు.

"కుందేలును అమ్మటమా? అది జరిగే పని కాదు!" అన్నాడు ముసలాడు. వాళ్ళు బేరం పదివేల మాడలకు పెంచినా ముసలాడు సరేననలేదు.

"వాళ్ళు అంతగా కావాలంటుంటే అమ్మరాదూ, డబ్బు కావాలని అంటూంటివిగా?" అన్నది ముసలిది.

"మన అవు మారినట్టు కుందేలు కూడా మారిపోతుందేమో?" అన్నాడు ముసలాడు తన భార్యతో.

దొంగలు ముగ్గురూ ఒకరికొకరు కన్నుమలిపి, "అలాటి భయం వద్దులే, ముసలాడా!" అన్నారు.

ముసలాడు పదివేల మాడలూ పుచ్చుకుని బుట్టతోబాటు తన రెండో కుందేలును వాళ్ళకు అమ్మేశాడు.

వాళ్ళు తమ గ్రామానికి తిరిగి వెళుతూ, "దీన్ని మన ఇళ్ళకు ముందుగా పంపి, మనకు ఏమేం వంటలు కావాలో మన పెళ్ళాలకు తెలియజేద్దాం," అనుకుని, ఒక్కొక్కడూ కుందేలుకు విడివిడిగా తమ అవసరాలు తెలిపి, కుందేలును వదిలేశారు. అది శరవేగంతో ఎటో వెళ్ళిపోయింది.

తరవాత ముగ్గురూ తమ తమ ఇళ్ళకు వెళ్ళి, కుందేలు రాలేదనీ, ముసలాడు తమను మోసం చేశాడనీ తెలుసుకున్నారు. వాళ్ళు ముగ్గురూ కలిసి ముసలాడి ఇంటికి వచ్చి, వాణ్ణి తిట్టనారంభించారు.

ముసలాడు ఓర్పుగా వాళ్ళ తిట్లన్నీ విని, "కుందేలును పంపేముందు దాన్ని ఒళ్ళంతా నిమిరారా?" అని అడిగాడు.

లేదని వాళ్ళు ఒప్పుకున్నారు.

"ఇంకేం? అది పిడికెడు గాలిగా మారి ఉంటుంది," అన్నాడు ముసలాడు.

"కుందేలు గాలిలో కలిసిపోవటమేమిటి? పిచ్చిగా మాట్లాడకు!" అన్నారు దొంగలు ముగ్గురూ.

"ఇంతపెద్ద అవు చిన్న మేకగా మారగా లేనిది, కుందేలు గాలిలో కలవటం విడ్డూరమా?" అని ముసలాడు అడిగాడు.

ముసలాడు తమ మీద పగతీర్చుకున్నాడని గ్రహించి దొంగలు వెళ్ళిపోయారు.





# నష్టపరిహారం

సిరిపురంలో కాపురముంటున్న రామయ్య, తన ఇంటి పెరట్లో బచ్చలి పాదు వేశాడు. బాగా ఎరువువేసి, శ్రద్ధగా పెంచడంవల్ల, అది ఏపుగా పెరిగి పందిరిదాటి పక్కనున్న పిట్టగోడమీదికి పాకింది.

ఒకరోజు అదే వీధిలో వున్న పెద్దరైతు చుక్కయ్య పెంచుతున్న మేకపోతు, పిట్టగోడ ఎక్కి బచ్చలి ఆకులు తినసాగింది. సమయానికి రామయ్య చూసి, రాయి విసిరి మేకపోతును తోలాడు. తను కష్టపడి పెంచుకుంటున్న బచ్చలిపాదును చుక్కయ్య మేక తినడం, రామయ్యకు బాధ కలిగించింది. వెంటనే అతడు చుక్కయ్య ఇంటికి వెళ్ళి, మేకపోతు బచ్చలిపాదు తినడం గురించి చెప్పి, ఇక నుంచి దాన్ని గొడ్లచావడిలో కట్టివేసుకోమనీ, లేదా అడవికి తోలి మేపుకోమనీ సలహాయిచ్చాడు.

చుక్కయ్య కోపంగా తల ఊపి వూరుకున్నాడు. ఆ తర్వాత మేకపోతు రెండు, మూడుసార్లు వచ్చి బచ్చలి ఆకులు తినడం, రామయ్య దాన్ని తరమడం జరిగింది.

ఒకసారి తెల్లవారుజామున మేకపోతు వచ్చి, బచ్చలిపాదు మొత్తం తినేసింది. రామయ్య అది చూసి, కోపం పట్టలేక గొడ్డలిని దానిమీదికి విసిరాడు. గొడ్డలి దాని తలకు తగలడంతో, అది కిందపడి గిలగిల తన్నుకుని చచ్చిపోయింది. తను కోపంతో చేసిన పనికి రామయ్య చాలా పశ్చాత్తాప పడ్డాడు.

తన మేకపోతు చచ్చిపోయిందని తెలిసి, చుక్కయ్య కోపావేశంతో మీసాలు మెలివేస్తూ రామయ్య ఇంటికివచ్చి, "మేకపోతు బహు మేలుజాతిది. ఆ సంగతి నీకూ తెలిసుండాలి. దాన్ని చాలా




దూరంనుంచి వందవరహాలకు కొని తెప్పించాను. నష్టపరిహారంగా, ఆ డబ్బు నువ్వు యిచ్చుకోవాలి!'' అన్నాడు.

మేకపోతును చంపినందుకు, పది వరహాలు చెల్లించడానికి రామయ్య ఒప్పుకున్నాడు. అలా కాకపోతే మరొక మేకపోతును కొనిస్తానన్నాడు. చుక్కయ్య అందుకు ఒప్పుకోక, మేకపోతును తాను ఉత్తరాదినుంచి తెప్పించాననీ, వంద వరహాలు ఇవ్వవలసిందేననీ పట్టుబట్టాడు.

అందుకు రామయ్య కోపంగా, ''నువ్వు పెద్ద రైతువే కావచ్చు. అయినా నేను నిన్ను లెక్కచెయ్యను. పదివరహాలకంటే చిల్లిగవ్వ ఎక్కువ యిచ్చేది లేదు,'' అన్నాడు.

చుక్కయ్య అప్పటికప్పుడే గ్రామ జమీందారు వద్దకు పోయి, జరిగింది చెప్పి, రామయ్య నుంచి తనకు వంద వరహాలు నష్టపరిహారంగా యిప్పించమని విన్నవించుకున్నాడు.

సిరిపురం జమీందారుది చపలబుద్ధి. అంతేకాక ఒట్ఠి అనుమానం మనిషి. న్యాయం ఎవరిపక్షాన వున్నదో, దోషి ఎవరో ఒకపట్టాన తేల్చి చెప్పలేడు. ఎవరేది చెప్పినా, నిజమేనేమో అనుకుని కంగారుపడిపోతాడు. చుక్కయ్యచెప్పింది విని, ఆయన రామయ్యను దివాణానికి పిలిపించాడు.

రామయ్య చేతులు కట్టుకుని జమీందారుతో, ''చిత్తం, మహాప్రభూ! నేను కావాలని ఆ మేకపోతును చంపలేదు. అది నా ఇంటి పెరట్లో జొరబడి బచ్చలిపాదు మొత్తం తినేసింది. కోపం కొద్దీ కొడ్డలి విసిరాను. అది దాని తలకు తగిలి చచ్చిపోయింది,'' అన్నాడు.

''అయితే, తప్పు నీదేగా! నష్టపరిహారం చెల్లిస్తావా ?'' అన్నాడు జమీందారు అనుమానంగా.

''ఇందులో నా తప్పేం లేదు ప్రభూ! నేను బచ్చలిపాదు వెయ్యబట్టే, ఈ

అనర్థం కలిగింది. లేకపోతే ఆ మేకపోతు వచ్చేదికాదు; నా చేతిలో చచ్చేదికాదు," అన్నాడు రామయ్య.

"ఆ మాట నిజమే! అసలు నువ్వు బచ్చలిపాదు ఎందుకు పెట్టావు?" అని ప్రశ్నించాడు జమీందారు.

రామయ్య ఒకక్షణం ఆలోచించి, "మా ఎదురింట్లో వున్న ఎల్లయ్య, నాకు బచ్చలిగింజలు యిచ్చాడు. అందువల్ల వాటిని, మా ఇంటిపెరట్లో నాటాను. ఇదంతా ఎల్లయ్య తప్పేగదా! కాబట్టి నష్టపరిహారం ఎల్లయ్య యిచ్చుకోవలసిందే," అన్నాడు.



జమీందారుకు రామయ్య చెప్పింది నిజంగా తోచి, తన నౌకరునొకణ్ణి పంపి ఎల్లయ్యను పిలిపించాడు. ఎల్లయ్య గడగడలాడుతూ వచ్చాడు.

జమీందారు అతణ్ణి, "నువ్వు రామయ్యకు బచ్చలిగింజలు యిచ్చిన మాట నిజమేనా?" అని అడిగాడు.

"నిజమే ప్రభూ!" అని ఒప్పుకున్నాడు ఎల్లయ్య.

"నువ్వు, ఆ గింజలు యిచ్చినందువల్ల, రామయ్య వాటిని పెరట్లో నాటి పెంచాడు. చుక్కయ్య మేకపోతు, ఆ బచ్చలిపాదంతా తినేసింది. రామయ్య గొడ్డలి విసిరాడు. మేకపోతు చచ్చిపోయింది. ఇదంతా నీ తప్పేగదా?" అన్నాడు జమీందారు.

ఎల్లయ్య గడగడ వణికిపోతూ, "మహాప్రభో! ఇందులో నా తప్పు ఆవగింజంతయినా లేదు. అంతా విశ్వనాథాచారిది," అన్నాడు.

"ఎవరా విశ్వనాథాచారి?" అని అడిగాడు జమీందారు.

"మన ఊళ్ళో వైద్యుడు, ప్రభూ! నాకు శరీరమంతా దురదలువస్తే, మందు కోసం ఆయన దగ్గిరకు వెళ్ళాను. ఒక సంవత్సరం పాటు, బచ్చలి ఆకు కూర తింటే, దురదలు పోతాయని చెబుతూ, ఆయనే గింజలిచ్చాడు. వాటిలో కొన్ని



రామయ్య కిచ్చాను. అంతే, ప్రభూ! ఇందులో నా తప్పేంలేదు. కాబట్టి, ఈ గొడవకంతకూ మూలకారకుడు, విశ్వనాథా చారి,'' అని చెప్పాడు ఎల్లయ్య.

జమీందారుకు, ఎల్లయ్య చెప్పింది నిజమే అనిపించింది. ఆయన విశ్వనాథా చారిని దివాణానికి రమ్మని కబురు పెట్టాడు.

ఈ తలతిక్క జమీందారు, తనను ఎందుకు రమ్మన్నాడో అర్థం కాక, కంగారు పడుతూ వచ్చాడు వైద్యుడు.

''ఏమయ్యా అచారీ! ఎల్లయ్యకు ఒంటి దురదలొచ్చి, నీ దగ్గిరకు వస్తే, మందు యివ్వాలిగాని, బచ్చలిఆకు రోజూ తినమని విత్తనాలు యిస్తావా? ఏమిటీ పాడు పని!'' అంటూ గట్టిగా మందలిస్తూ ప్రశ్నించాడు జమీందారు.

జరిగిందేమిటో అర్థం కాని విశ్వనాథా చారి, ఆయనను, ''అసలేం జరిగింది, ప్రభూ?'' అని అడిగాడు.

''గొప్ప నష్టమే జరిగిపోయింది! ఎల్లయ్య నువ్విచ్చిన బచ్చలివిత్తనాలు కొన్ని, రామయ్య కిచ్చాడు. రామయ్య వాటిని నాటి పాదు పెంచాడు. దాన్ని చుక్కయ్య మేకపోతు నిలువునా తినేసింది. రామయ్య అది చూసి కోపం కొద్దీ గొడ్డలి విసిరాడు. అది తలకు తగిలి మేకపోతు చచ్చిపోయింది. పాపం, చుక్కయ్య దాన్ని వంద వరహాలు పోసి, ఎక్కడో ఉత్తరాది ప్రాంతం నుంచి తెప్పించాడట. ఇప్పుడు చుక్కయ్యకు నష్టపరిహారం ఎవ్వరివ్వాలి? బచ్చలి విత్తనాలు ఇచ్చిన నీదే కదా తప్పు?'' అన్నాడు జమీందారు.

అంతా విన్న విశ్వనాథాచారికి నెత్తిన పిడుగు పడినట్టయింది. ఇందులో తప్పంతా చుక్కయ్యది. ఆయన మేకపోతును ఏ గుంజకో కట్టెయ్యకుండా ఊరి మీద వదిలాడు. ఆ తర్వాత జమీందారు తిక్క మనిషని ఎరిగిన రామయ్య, ఎల్లయ్యలు తెలివిగా నష్టపరిహారం తన

నెత్తి మీద రుద్దడానికి ప్రయత్నిస్తున్నారు! ఈ ఆపద నుంచి ఎలా బైటపడాలా అని ఆలోచించగా, విశ్వనాథాచారికి ఒక ఉపాయం తోచింది.

ఆయన జమీందారుతో, "ప్రభూ. వంటి దురదలు పోవడానికి, మందులు తాత్కాలికంగా మాత్రమే పని చేస్తాయి. ముఖ్యంగా ఆహారలోపంచేత అవివస్తాయి. ఆకుకూరలు తినడంవల్ల శాశ్వత నివారణ జరుగుతుంది. బచ్చలికూర అన్ని కాలాల్లోనూ పచ్చగా పెరుగుతుంది గదా! అందువల్ల వైద్యుడుగా, నా ధర్మం నెరవేర్చాను. దానికి కారణం వైద్యుడుగా, నేనీ గ్రామంలో వుండడం. నేను ఇక్కడ వుండకపోతే, ఈ అనర్థం జరిగేది కాదు! ఏం చేయను ?" అన్నాడు.

జమీందారు కొంచెంసేపు ఆలోచించి, పాపం, వైద్యుడు చెప్పేది నిజమే అనుకున్నాడు. తర్వాత ఆయన, ఆచారిని, "అవునూ! ఇంతకూ నువ్వీ గ్రామంలో ఎందుకున్నావు ?" అని ప్రశ్నించాడు.

ఆ ప్రశ్నకు విశ్వనాథాచారి సంతోషించి, "ప్రభువులు మంచి ప్రశ్నే వేశారు. ఇందులో నా తప్పు ఏమాత్రమూ లేదు. నేను మా గురువుగారి దగ్గిర వైద్యవిద్య నేర్చుకుంటూండగా, తమ తండ్రి శ్రీశ్రీ నరసనాయుడుగారు విచ్చేసి, తమ ఊర



మంచి వైద్యుడు లేడని, మా గురువుగారికి చెప్పారు. ఆ సమయంలో గొప్పభూస్వాములైన శ్రీ దండయ్యగారు—అంటే చుక్కయ్యగారి తండ్రిగారు ఏదో అంతు చిక్కని వ్యాధితో బాధపడుతున్నారు. తమ తండ్రిగారూ, చుక్కయ్య తండ్రిగారూ ఆప్తస్నేహితులన్నది, ఈ చుట్టు పక్కల నాలుగైదు పరగణాల వాళ్ళందరూ ఎరిగినదే!" అన్నాడు.

"అవునవును! ఆ సంగతి ఇప్పటికీ చాలామంది చెప్పుకుంటూంటారు," అన్నాడు జమీందారు ఆనందంగా.

"ప్రభువులవారికి ఈ సంగతి ఇప్పటికీ గుర్తుండడం, నా అదృష్టం!" అని

విశ్వనాథాచారి చిన్నగా నవ్వుకుని, "తమ తండ్రిగారు అడిగినమీదట, ఆయన కోరిక ప్రకారం మా గురువుగారు చుక్కయ్యగారి తండ్రిగారికి చికిత్స చేసేందుకు నన్నీ ఊరు పంపారు. ఆ విధంగా దీనికంతకూ కారకులు తమ తండ్రిగారూ, చుక్కయ్య తండ్రిగారూనూ. కాబట్టి నష్టపరిహారం వారే చెల్లించడం ధర్మం అవుతుంది." అన్నాడు.

వైద్యుడు చెప్పింది ధర్మంగా తోచింది, జమీందారుకు. తప్పంతా తన తండ్రిదీ, చుక్కయ్య తండ్రిదీ అని ఆయన నిర్ణయించాడు.

తర్వాత ఆయన విశ్వనాథాచారితో, "నువ్వు చెప్పినదంతా బాగానే వున్నది. ఇందులో నీ తప్పు ఆవగింజంత కూడా కనిపించడం లేదు. కాని నా తండ్రిగారూ, చుక్కయ్య తండ్రిగారూ బతికి లేరు. చనిపోయినవాళ్ళు నష్టపరిహారం ఎలా చెల్లిస్తారు?" అంటూ తన సందేహం వెలిబుచ్చాడు.

విశ్వనాథాచారి అమ్మయ్య బతికి పోయాననుకుని, జమీందారుతో, "ప్రభువులు తమ తండ్రిగారిలాగే న్యాయాన్యాయాలను గుర్తించడంలో, చాలా సూక్ష్మబుద్ధి కలవారు. అవును, తమరు సెలవిచ్చినట్టు, చనిపోయినవాళ్ళు నష్టపరిహారం ఎలా చెల్లిస్తారు!" అన్నాడు ఎంతో వినయం నటిస్తూ.

అప్పుడు జమీందారు, చుక్కయ్య కేసి కళ్ళెర్రచేస్తూ చూసి, "ఈ దిక్కుమాలిన గొడవకంతకూ, నువ్వే మూలకారణం. మేకపోతూ, గొర్రెపోతుల్లాంటి వాటిని పెంచే శక్తిసామర్థ్యాలూ, అర్హతా నీకే మాత్రం లేవు. ఏనాడైనా నువ్వు అలాంటి వాటిని పెంచుతున్నట్టు తెలిసిందో, నిన్ను గ్రామంనుంచి బహిష్కరిస్తాను జాగ్రత్త." అన్నాడు.

ఈ తీర్పు విని ఒక్క చుక్కయ్య తప్ప, మిగతావాళ్ళందరూ చాలా సంతోషించి అక్కడి నుంచి తమ ఇళ్ళకు వెళ్ళిపోయారు.





## వింత పువ్వులు

మలేషియాలోని ఒక రకం సీతాఫలం చెట్లు, మిగతా చెట్లలా రెమ్మల ఆధారంగా కాకుండా, సరాసరి చెట్టు కాండం నుంచీ, కొమ్మల నుంచీ పువ్వులు పూస్తాయి!



## క్షార జలాశయం

డిజిబౌట్‌లోని అస్సాల్ తటాకంలో ప్రపంచంలోకెల్లా చాలా ఉప్పు నీళ్ళున్నాయి. ఇవి సముద్రజలంకన్నా పదింతలు ఉప్పుగా వున్నాయి. ఈ నీళ్ళలో ఎటువంటి చేపలూ బతకవు. సముద్ర మట్టానికి 510 అడుగులు దిగువగా వున్న ఈ జలాశయాన్ని ఆఫ్రికాకంతటికీ మరీ దిగువగా వున్న తటాకంగానూ, ప్రపంచంలో మూడవదిగానూ చెప్పుకుంటారు.

## రాక్షస వల్మీకం

ఆస్ట్రేలియాలోని తెల్లచీమలు 20 అడుగుల ఎత్తూ, 100 అడుగుల వెడల్పు గల బ్రహ్మాండమైన పుట్టలు పెడతాయి!



THE MOST ENDEARING GIFT YOU CAN THINK OF
FOR YOUR NEAR AND DEAR WHO IS FAR AWAY

# CHANDAMAMA



**Give him the magazine in the language of his choice—**
Assamese, Bengali, English, Gujarati, Hindi, Kannada, Malayalam, Marathi, Oriya, Sanskrit, Tamil or Telugu
**—and let him enjoy the warmth of home away from home.**

**Subscription Rates (Yearly)**

**AUSTRALIA, JAPAN, MALAYSIA & SRI LANKA**

By Sea mail Rs. 81.00 By Air mail Rs. 156.00

**FRANCE, SINGAPORE, U.K., U.S.A., WEST GERMANY & OTHER COUNTRIES**

By Sea mail Rs. 87.00 By Air mail Rs. 156.00

**Send your remittance by Demand Draft or Money Order favouring 'Chandamama Publications' to:**

CIRCULATION MANAGER **CHANDAMAMA PUBLICATIONS** CHANDAMAMA BUILDINGS
VADAPALANI MADRAS 600 026

# ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1990 జూన్ నెల సంచికలో ప్రకటింపబడును.



Devidas Kasbekar



Chandrakant Khata

★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ ఏప్రిల్ నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/—లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: — చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

## ఫిబ్రవరి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: అన్నం కోసం ఆలోచన! రెండవ ఫోటో: ఆకలి కోసం నిరీక్షణ!

పంపినవారు: డి. రమేష్‌బాబు, మహబూబ్ నగర్—509 001.

బహుమతి మొత్తం రు. 50/– నెలాఖరులోగా పంపబడుతుంది.


## చందమామ

ఇండియాలో సంవత్సర చందా: రూ. 36-00

చందా పంపవలసిన చిరునామా:

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026.

ఇతర దేశాల చందా వివరాలకు రాయండి:

చందమామ పబ్లికేషన్స్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.


---


The stories, articles and designs contained herein are exclusive property of the Publishers and copying or adapting




**1975**
వనితల స్థితిగతులు
మెరుగుపరచడానికై....

* అంతర్జాతీయ మహిళా సంవత్సరంలో ఉదయించిన
ఏకైక స్త్రీజన పత్రిక ఏది?

# వనిత

* దశాబ్దంన్నరగా స్త్రీలకు ఉపయుక్తమైన అనేక
అంశాలను ప్రస్తావిస్తున్న ఏకైక మాస పత్రిక ఏది?

# వనిత

* మరి నెలతల ప్రియనెచ్చెలి ఏది?
నిస్సందేహంగా

# వనిత

**1989**
వనితలను అభ్యుదయ పథంలో
నడిపించడంలో పదిహేనవ
సంవత్సరం....




కారణం
● విజ్ఞానానికి ● వికాసానికి ● వినోదానికి

# వనిత

చందా వివరాలకు:
విజయా బుక్ హౌస్,
చందమామ బిల్డింగ్స్,
వడపళని, మద్రాసు - 600 026

# What makes Junior Quest every child's best friend?



It's crammed with answers.
It's a challenge to do-it-yourself.
It's an invitation to contests.
It's an exciting pull-out in each issue.

JUNIOR QUEST
*Where finding out is fun*




To subscribe write to,
JUNIOR QUEST,
Dolton Agencies, Chandamama Buildings,
N.S.K. Salai, Vadapalani,
Madras: 600 026.

***A new monthly English children's magazine***

